# శ్రీవైష్ణవసంప్రదాయగ్రంథముల జాబితా.

(కంచి-ప్ర. అణ్ణంగరాచార్యస్వాములవారి ప్రచురము.)

| | | | |
|---|---|---|---|
| శ్రీవరవరమునీన్ద్ర గ్రన్థమాలా. | 7 | 8 | 0 |
| అస్యాః ప్రత్యేక విభాగాః | | | |
| శ్రీవచనభూషణవ్యాఖ్యానమ్. | 2 | 8 | 0 |
| శ్రీవచనభూషణ ముముక్షుప్పడివ్యాఖ్యానమ్ | 3 | 8 | 0 |
| ఆచార్యహృదయవ్యాఖ్యానమ్ | 2 | 0 | 0 |
| భగవద్విషయమ్. ఈడుముప్పత్తాఱాయిరప్పడి. | | | |
| మొదటి పత్తున్నుండి యేడుపత్తులు, | 14 | 0 | 0 |
| 9 పత్తు. | 2 | 0 | 0 |
| శ్రీలక్ష్మీసహస్రనామ, నామావళీ సహితమ్. | 0 | 6 | 0 |
| వేదాన్తదేశిక స్తోత్రమాలా. | 2 | 0 | 0 |
| పాదుకా సహస్రమ్. | 1 | 4 | 0 |
| పఞ్చస్తవమ్, శ్రీరఙ్గరాజ స్తవమ్. | 0 | 12 | 0 |
| వేదవిణ్ణప్పమ్, శ్రీరామాయణ దణ్డకమ్. | 0 | 4 | 0 |
| శ్రీవరవరముని దణ్డకస్తుతిః | 0 | 4 | 0 |
| శ్రీమద్వరవరముని సహస్రనామస్తోత్రమ్. | 0 | 4 | 0 |
| శ్రీవైష్ణవసౌభాగ్యమ్ శ్రీమద్వరవరముని విషయక పఞ్చదశస్తోత్రాణి. | 0 | 8 | 0 |
| శ్రీవిష్ణు సహస్రనామటీక | 1 | 0 | 0 |
| చతుశ్శ్లోకీయమ్, శ్రీస్తవముమ్మణిప్రవాళవ్యాఖ్యా | 0 | 8 | 0 |
| ముకున్దమాలాటీక. | 1 | 0 | 0 |

శ్రీరస్తు.

మదరాస్. సద్గ్రంథ ప్రకాశనసభయొక్క ప్రచురము

మూడవ సంవత్సరమున మూడవప్రచురము



భగవద్రామానుజ విరచితమైన

# గద్యత్రయము

కంచి. ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులవారు
రచించిన

ఆంధ్రటీకా సమేతము.



ప్రాప్తిస్థానము :—గ్రంథమాల ఆఫీస్
కాంచీపురము.

1950

దీనివెల 1—4—0

(భావము) వేదాంతశాస్త్రమను పచ్చకర్పూరము సురక్షితముగను, బరిమళము తగ్గకయు నుండునట్లుంచుటకు బంగారు బరిణెయనఁ దగినట్లు వేదాంతమార్గ ప్రతిష్ఠాపనాచార్యులై యార్యులందఱకు శిరోరత్నముగా విలసిల్లు శ్రీ ఎమ్బెరుమానారులను రేయింబవళ్లును నమస్కరించుచున్నాను.

చామీకరం-బంగారు, కరణ్డకం-బరిణె, ఎమ్బెరుమానారులు వేదాంతవిద్యానిధులనుట. * సర్వగన్ధః * యనఁబడిన సర్వేశ్వరుని వేదాంతములు వహించుచుండుటచేత నవి కర్పూరముగా రూపింపఁబడినవి.

ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణమ్.

గద్యభావప్రకాశిక యను వ్యాఖ్యానమునకు

అవతారిక.

శ్రీమద్రఙ్గే రఙ్గపతేస్తద్దయితాయాః
స్తోత్రం శ్రీమద్భాష్యకృతా ప్రాక్ప్రణతేన ।
భక్తానా ముజ్జీవన హేతో రతి భోగ్యం
ప్రోక్తం గద్యం విప్రియతేద్య స్ఫుటబోధమ్ ॥

కాఞ్చీవాది భయఙ్కర వంశీయాణ్ణఙ్గరార్యదాసేన ।
భగవద్భాష్యకృదీరిత గద్యత్రయ సూక్తివివరణం క్రియతే॥

శాస్త్రములందు కర్మయోగమనియు, జ్ఞానయోగమనియు, భక్తియోగమనియు, ప్రపత్తియోగమనియు నిట్లుపాయములనేకములుగా జెప్పఁబడియున్నవి.

శ్రీ భాష్యకారులు కుదృష్టికలవారల నిరసించుటకై శ్రీ భాష్యము ననుగ్రహించిరి కాబట్టి ఆచార్యరుచి పరంపరా పరిగృహీతమగు ప్రపత్తియోగమును దాచిపెట్టి భక్తియోగ మును వెల్లడించిరి. తత్త్వమసీత్యాది వాక్య జన్య జ్ఞానమే మోక్షసాధనమనియు, కర్మజ్ఞానసముచ్చయమే మోక్షసాధన మనియు చెప్పెడి కుదృష్టి కలవారల నిరసించుటకై, కర్మాంగకమై, వేదన ధ్యానోపాసనాది శబ్దవాచ్యమయిన భక్తిరూపాపన్నమైన జ్ఞానవిశేషమే వేదాంతాభిమతమైన మోక్ష సాధనమని శ్రీభాష్యమున ననుగ్రహింపవలసి వచ్చెను.

అయినను శ్రీ భాష్యకారులు తమరుచి పరిగృహీతమైన యర్థమునే నమ్మియుండు సాత్వికులకు తమ హృదయ మును విశదముగ వెల్లడింపఁదలఁచి, యాచార్యరుచి పరిగృహీతమై తమకు రక్షకముగా నమ్మియుండు అర్థము ప్రపత్తియే యను నంశమును నీ గద్యము మూలమున వెల్లడించి యనుగ్రహించుచున్నారు.

శ్రీ భాష్యమునందు ప్రపత్తిని బయలుపఱిచియే కుదృష్టి కలవారల నిరసింపరాదా యందురేని ; ఇందులకు ఆచ్చాన్ పిళ్లై యనువా రనుగ్రహించినక్రమ మిదిగదా—బ్రాహ్మణుఁడు చండాలునకు వేదము నుపదేశింప వలనుగానట్లు దూరమందున్న వారలకుఁ బరమ రహస్యమైన యీ యర్థమును వెల్లడిచేయ వలనుగాదని తలఁచి వార లెఱింగిన శాస్త్రము మూలముగనే వారల నిరసించి శాస్త్రతాత్పర్యమైన స్వసిద్ధాం

తమును నీ ప్రబంధము మూలమున వెల్లడించి యనుగ్రహించు చున్నారు.

భక్తికన్నను ప్రపత్తి మిక్కిలి శ్లాఘ్యమైనది. ఎటులందు రేని, (భక్తి అధికృతాధికారము. ప్రపత్తి సర్వాధికారము.) భక్తి త్రైవర్ణికులకే యనుష్ఠింపఁదగినది. ప్రపత్తియన్ననో యన్ని జాతులవారలకు ననుష్ఠింపఁదగినది. భక్తి ననుష్ఠించుట మిక్కిలి కష్టము. ప్రపత్తియన్ననో సులభముగా ననుష్ఠింపఁ దగినది. భక్తి త్వరగా ఫలము నిచ్చునదికాదు. ప్రపత్తియన్ననో త్వరలో ఫలమునిచ్చును. భక్తియొకవేళ ఫలమునీయకపోయినను బోవచ్చునని తలంపఁదగినది. ప్రపత్తి యన్ననో తప్పక ఫలము నిచ్చునది. భక్తిసాధింపఁదగినది. ప్రపత్తియన్ననో సిద్ధమైనది. భక్తి అత్యంతపారతంత్ర్యరూప స్వరూపమునకు విరుద్ధమైనది. ప్రపత్తియన్ననో పూర్వోక్త స్వరూపమునకనుకూలమైనది. భక్తి పొందఁదగిన ఫలమునకు అనురూపము కానిది. ప్రపత్తియన్ననో ఫలమున కనురూప మైనది—కాఁగా నిట్టి వైలక్షణ్యములనుబట్టియే వేదాంతదేశికులును న్యాసతిలకమున—

"ఆర్తేష్వాశుఫలా తదన్యవిషయేష్వచ్ఛిన్న దేహాన్తరా
వహ్నేర్దేరనపేక్షణాత్తనుభృతాం సత్యాది వద్వ్యాపినీ।
శ్రీరఙ్గేశ్వర యావదాత్మనియత త్వాత్పార తన్త్ర్యోచితా
త్వయ్యేవ త్వదుపాయధీరపిహిత స్వోపాయభావా
ఽస్తుమే" ॥

యని యనుగ్రహించిరి. ఈ శ్లోకమున ప్రపత్తికిఁ గూర్పబడిన ప్రతి విశేషణమును భక్తివ్యావర్తకముగనే కలదు.

ఈ ప్రపత్తి వేదాంతసిద్ధమా యని యడుగుదు రేని యట్లే కాఁగలదు. ఉపనిషత్తులో * సత్యం తపో దమశ్శమో దానం ధర్మః ప్రజనన మగ్నయోగ్నిహోత్రం యజ్ఞో మానసమ్* అని యొకదానికన్న మఱియొకటి శ్రేష్ఠమైనదిగాఁ జెప్పఁబడి యన్నింటికన్న శ్రేష్ఠమైనదిగా * తస్మాత్ న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః * యని తపస్సులలో శ్రేష్ఠమైన తపస్సు ప్రపత్తియని ముగింపఁబడినది.

ఇట్లు వేదాంతసిద్ధమగుటయేగాక ధర్మజ్ఞులలో నగ్రగణ్యులైన యాళ్వారులయు నాచార్యులయు ననుష్ఠానము మూలముగను నిదియే పరిగృహీతమయియుండును. కాఁగా వేదాంతసిద్ధమును, స్వరూపప్రాప్తమును, నాచార్యరుచిపరిగృహీతమును, శరణ్యహృదయానుసారియు నునని తేలిన యిట్టిదానిని దమశిష్యులు పోగొట్టుకొనరాదని తలఁచి, తామును, భగవంతుఁడును మాత్ర మెఱింగియుండునదని యనుసంధింప నమరియుండునట్లు తమ పరమకృపచేతఁ ప్రబంధరూపమున వెల్లడించుచున్నారు.

ఈ ప్రబంధ మవతరించినక్రమ మెట్టిదనిన ; శ్రీరంగమున నొకపంగుని యుత్తరానక్షత్రముతోఁగూడిన శుభదినమున భగవంతుఁడును శ్రీదేవియు దివ్యసింహాసనమున వెలసి యున్న సమయమున స్వామి యెంబెరుమానారులు విజయము చేసి ప్రణామము లర్పించి నిలిచిరి. అప్పుడు మనవంటివారి భాగ్యపరిపాకముచేత హృదయమున సంసారభీతి నడయాడ, శ్రీచరణములపైఁబడి శరణుచొచ్చి యా ప్రకారమునకుఁ ప్రబంధమును వెలయించిరనుట.

ఈ గద్యము మంత్రరత్నమగు ద్వయమునకు వ్యాఖ్యానమయి వెలయునని మనపూర్వాచార్యులు నిర్వహించిరి. ఇదియే మూలమందును స్పష్టముగాఁ గలదు. ఇందు శ్రీదేవియు, భగవంతుఁడును స్వామివారికిఁ బ్రతివచన మిచ్చినట్లు కానవచ్చుచున్నదికదా, అర్చా సమాధినిఁగడచి వారు * అస్తు తే, తయైవ సర్వం సంపత్స్యతే * నిత్యకింకరో భవ* ఏవం భూతోఽసి* అత్రైవ శ్రీరఙ్గే సుఖమాస్వ* నిత్య కింకరో భవిష్యసి * మా తే భూ దత్రసంశయః *......ఇతి మయైవ హ్యుక్తమ్........నిస్సంశయస్సుఖమాస్వ * అనియు నా దివ్యదంపతులు తమ దివ్యముఖమువెఱచి యనుగ్రహించిరా యన్నచో * అహేః పాదమహిరేవ జానాతి * యనునట్లుగ నాదివ్య దంపతులహృదయగతాభిప్రాయములను వారి దివ్యవదనముల నాలోకించి తెలిసి పలికిరని కొందఱందురు. దివ్యదంపతులు వాతెఱచి సాగ్రహముగఁ బలికిన యుత్తరములనుగొని పదబంధములవలనఁ బెంచి పలికిరని కొందఱందురు. సాక్షాత్సంవాదమే జరిగినదని వేదాంతదేశికులు తమ యభిప్రాయమును గద్యభాష్యమునఁ బొందుపఱిచిరి.

ఆచార్యుల గ్రంథములన్నియు తత్త్వహితపురుషార్థముల వెల్లడించుటకే యవతరించినవగుటచేత నీ దివ్యగ్రంథమును నట్టిదేయగును. ఇందు సంబోధనముగాఁ గూర్పఁబడిన పదములన్నియు తత్త్వపరములనియు, శరణవరణప్రతిపాదక వాక్యము హితపరమనియుఁ, బ్రార్థనా ప్రకాశక వాక్యములు పురుషార్థ పరములనియు గ్రహించునది.

ఇవి గద్యత్రయమను పేర నొక ప్రబంధముగాఁ

చేరొ్కనఁబడుచున్నను నొక్కొకటియుఁ బ్రత్యేక ప్రబంధ మగుననియే పూర్వులతలంపు. కావుననే శ్రీమద్రామానుజు లనుగ్రహించినప్రబంధములు తొమ్మిదని గురుపరంపరా సారమునందు వేదాంతదేశికులు లెక్కించిరి.

అవతారిక ముగిసినది.

శ్రీః.

ఎమ్బెరుమానారు లనుగ్రహించిన

# శరణాగతిగద్యమ్.

(మూలము) భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణవిభవైశ్వర్య శీలాద్యనవధికాతి శయాసంఖ్యేయ కల్యాణగుణగణాం, పద్మవ నాలయాం, భగవతీం శ్రియం దేవీం నిత్యాన పాయినీం నిరవద్యాం దేవదేవ దివ్యమహిషీం అఖిలజగన్మాతరమ్ అస్మన్మాతరమ్ అశరణ్య శరణ్యా మనన్య శరణశ్శరణ మహం ప్రపద్యే॥ ౧

(పదార్థము.) భగవన్నారాయణ - సమస్త కల్యాణ గుణ పరిపూర్ణుఁడైన నారాయణునకు, అభిమత అనురూప - ఇష్టమైనదియుఁ దగినదియునై యున్న, స్వరూప రూప గుణ

విభవ - స్వరూపమేమి విగ్రహమేమి విగ్రహగుణములేమి విభూతులేమి యివియన్నియు, ఐశ్వర్య శీల ఆది - ఐశ్వర్యము సౌశీల్యము మున్నగు, అనవధిక అతిశయ - ఎల్ల లేని యతిశయము కల, అసంఖ్యేయ - లెక్కింపవలనుగాని, కల్యాణగుణగణాం - కల్యాణగుణసమూహమును గలదై, పద్మవన ఆలయాం - కమలవనమును వాసస్థానముగాఁ గలదై, భగవతీం - పరమపూజ్యురాలై, శ్రియం - శ్రీయనుదివ్యనామమును గలదై, దేవీం - తనమేనకాంతి నిండుగ గలిగినదై, నిత్య అనపాయినీం - (భగవంతుని) ఏనాఁడు నెడఁబాయనిదై, నిరవద్యాం - పరిశుద్ధికలదై, దేవదేవ దివ్య మహిషీం-దేవాధిదేవుఁడైన యెమ్పెరుమానునకు దివ్యమహిషియై, అఖిల జగన్మాతరం - సకలలోకములకును తల్లియై, అస్మన్మాతరం - (విశేషించి) అడియేనికి దల్లియై, అశరణ్య శరణ్యాం-రక్షకులు లేనివారలను రక్షించునదై యున్న శ్రీ దేవిని, అనన్యశరణః అహమ్ - ఎందును శరణమొండు కానని యడియేను, శరణం ప్రపద్యే - శరణుచొచ్చుచున్నాను.

(విశేషార్థము.) ఈ చూర్ణికచే మున్ముందు శ్రీదేవిని శరణు చొచ్చుచున్నారు. ఇక దాము భగవంతుని శ్రీచరణములందు వెల్లడింపఁబోవుచున్న శరణాగతి నిష్ఠకు ఉపేయ రుచియు, ఉపాయాధ్యవసాయమును బరిపక్వముగా నుండవలసియున్నందున నవి కొఱతలేక సిద్ధింపవలయునని శ్రీదేవి చరణములందు శరణుచొచ్చుచున్నారు. లోకమున నెయ్యది సిద్ధింపవలయునన్నను శ్రీదేవికృపచేతనే సిద్ధింపవలయుననునధ్యవసాయము కలవారల కిది ప్రాప్తమే కాగలదు. ఇరా

మామునిమాత్రుదాదిలోని నిగమాన పాసురమిచ్చట పొందిక
మైన యుదాహరణముగా ననుసంధింపదగినది. అందు
* పద్మే స్థిత మామునలర్పావైమై ప్రోక్షుకుమ్ * అని శ్రీదేవిని
ప్రార్థించుచు బలికినది ఎమ్బెరుమానారుల శ్రీచరణ నళిన
ములు తమ తలపై బొందియుండుటకయి కదా. * నమ్ తలై
మిశైయే పొఙ్గియకీర్త్తి యిరామానుశ నడిప్పూ మన్నవే *
యనిరి కదా.

* భగవన్నారాయణాభిమత * ఇత్యాది విశేషణ
ములచేత శ్రీదేవియొక్క స్వరూపము రూపము విభవము
గుణము మున్నగునవన్నియు భగవంతుని చిత్తమునకు మిక్కిలి
యిష్టమైనవియు తగినవియునై యున్నవనుట. లోకమున
కొందఱు వనితల రూపగుణాదులు పురుషులకు ననుభవింప
బ్రాప్తములయియుండియు మదికి నింపుగూర్చునవి కాకుండు
టయు గలదు. కొందఱు స్త్రీలరూపగుణాదులు మదికి
సంతోషము గలిగించునవైయున్నను బ్రాప్తియుండదు. కాన
నభిమతమైన దనురూపముకాకయు ననురూపమైన దభిమతము
కాకయునుండు విధము లోకమున గానవచ్చుచున్నది. ఈ
దివ్యదంపతుల విషయముననట్లు లేదనుట. అభిమతత్వమును
ననురూపత్వమును గలిసి లోకమున నేదోయొకచోట పొంది
యుండినను సకలాంశములందును బొందిక కలుగుటయరుదు.
దేహగుణము చక్కగానుండిన నాత్మగుణము చక్కగా
నుండదు. ఆత్మగుణము చక్కనైయున్నచో దేహగుణము
చక్కనైయుండదని యిట్లు వైరూప్యము కలుగుటకలదు.
అట్లునుగాక దివ్యదంపతులకు స్వరూప రూపగుణ విభవైశ్వ

ర్యాదులయిన సకలాంశములందును నభిమతత్వమును నను రూపత్వమును గలదనుట.

ఈ మొదటి విశేషణమునందు గుణశబ్దము రెండు మారులు పేర్కొనబడియున్నది. మొదటి గుణశబ్దము దేహ గుణమైన సౌందర్యలావణ్యాదులను జెప్పును రెండవ గుణ శబ్దము వాత్సల్య, సౌశీల్య సౌలభ్యాదులయిన యాత్మగుణము లను జెప్పును. [విభవ] భోగోపకరణములై శ్లాఘ్యములై యున్న వస్తుసమూహములు విభవమనబడును. అట్టి వస్తువు లన్నియు భగవంతునవై యుండ, శ్రీదేవికి ప్రత్యేకముగా విభ వము కలదా యన్నచో; లోకమున దంపతులనుద్దేశించి గానవచ్చు న్యాయము ననుసరించి యామెకని వేర్పరచి యుంచుకొనబడు మాల్య, భూషణ, వస్త్రాదులు పెక్కులున్నవి కదా; విభవ అర్చావతారములందు గనుగొనుసది. [ఐశ్వర్య] ఐశ్వర్య మనగా నియామకత్వము. సర్వనియామకుడు భగవంతుడై యుండ, నీమెకు నియామకత్వము కలదాయన్నచో సర్వేశ్వ రుని యిచ్చచే గలుగు నియామకత్వము కలదు: * శేష శేషాశనాది సర్వపరిజనం భగవత స్తత్తదవస్థోచిత పరిచర్యా యా మాజ్ఞాపయన్త్యా * యని వైకుంఠగద్యమున ననుగ్ర హించుటను గనునది. చేతనుల గర్మానుగుణముగా నియ మింపగలదు. ఈశ్వరుని రక్షణానుకూలముగా నియమింప గలదు అని ఆచ్చాన్ పిళ్లైయనువారనుగ్రహించియున్నారు. [శీల ఆది] తక్కువవారితో వ్యత్యాసము లేక కలసి మెలసి యుండుట శీలము. సౌశీల్యమనునదియునిదే. సర్వేశ్వరుని శీలము గుహాదు ముఖ్యగుణారల విషయమున వెలసియుండి

నట్లు శ్రీదేవియొక్క శీలము త్రిజటాదుల పక్షమున బలిసి యుండుట చూడదగును. అది శబ్దముచే వాత్సల్యసౌశీల్యాదులు గ్రహింపదగినవి.

(అనవధికాతిశయ) ఇది గుణముల కియ్యబడిన విశేషణము. దీనిభావమును వినుడు, ఇక్కడ చెప్పబడిన గుణములలో గొన్నిగుణములో యన్నిగుణములునో లౌకికులందుండినప్పటికిని నవి యించుకించుక పొడచూపియుండునేకాని యొక్కొక్కగుణమును బూర్ణమైన యుత్కర్షముతో నుండజాలదు. శ్రీదేవియెడ నట్లుకాదు; ఒక్కొక్క గుణము యొక్కయు నతిశయమెల్ల కనరానిదిగానే యుండును.

(అసంఖ్యేయ) గుణములు వేర్వేరుగా లెక్కపెట్టవలను, గాకుండుటయేకాక గుంపులుగుంపులుగానైనను లెక్కింప వలనుకాదు. లోకమున నపరిమితములుగాకల కొన్ని వస్తువులను వేర్వేరుగా లెక్కింపవచ్చును; కొన్ని వస్తువుల నట్లు వేర్వేరుగా లెక్కింప నలవికాకున్నను ' నూఱు తూముల వడు, వేయితూముల నువ్వులు' అను రీతిని రాశిగా లెక్కపెట్టవచ్చును. శ్రీదేవి గుణములన్ననో భగవంతుని గుణములవలెనె యేవిధముగను లెక్కింపరానివని తేలినది.

(పద్మవనాలయాం) * పద్మేస్థితాం పద్మవర్ణామ్ * అని శ్రుతియు నుడివెను. పద్మమును జెప్పినది మంగళకరములైన సకలవస్తువులను జెప్పినట్లై సర్వమంగళనివాసిని యనబడియె. * యచ్చ హి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే తత్సర్వం త్వదధీనమేవ * యని కూరేశులును శ్రీస్తవమునం దనుగ్రహించియున్నారు. పరిమళమే దివ్యమంగళ

విగ్రహామహ్యేనా యనదగిన సర్వేశ్వరునకును బరిమళమును గూర్పగలిగిన దనదగి పరిమళ ప్రచురమైన పద్మవనమున వసించునదనుట.

(భగవతీం) * తత్ర పూజ్య పదార్థోక్తి పరిభాషా సమన్వితః। శబ్దోయం నోపచారేణ * యని శ్రీవిష్ణుపురాణమున (6-5-77) చెప్పబడినట్లు పూజ్యవాచకము కాదగును.

(శ్రియమ్) సకలచేతనులచేతను దాను బురుషకారముగ నాశ్రయింపబడునది. 2. ఆశ్రితుల కార్యములను నెఱవేర్చుటకై భగవంతుని నాశ్రయించియుండునది. 3. ఆశ్రితుల విన్నపములను జెవియిచ్చి వినునది. 4. వానిని దగు సమయమున భగవంతునకు వినిపించునది. 5. ఆశ్రితుల యపరాధములను లేనివిగా జేయునది. 6. తన కల్యాణగుణములచేత లోకమును సంతోషపెట్టునది—అని యిట్టి యాఱర్థములను నొసంగు నాఱువిధముల వ్యుత్పత్తికములచేత (1. శ్రీయతే, 2. శ్రయతే, 3. శృణోతి, 4. శ్రావయతి, 5. శ్రిణాతి, 6. శ్రీణాతి) నిష్పన్నమగు శబ్దము కదా ఈ శ్రీశబ్దము. ఈ శ్రీనామముయొక్క సాటిలేని పేరిమిని * శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్ * అని ఆళవందారులును 'శ్రీరపి యతః' అని భట్టరును వెల్లడించిరి.

(దేవీమ్) దివుక్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాన్తి గతిషు * యని పది అర్థములుకల దివు ధాతువునందు (దీవ్యతీతి దేవీ) యని నిష్పన్నమైన శబ్దము కావున యథార్థముగ ఆ యర్థములను గ్రహింపవచ్చును.

(నిత్యానపాయినీమ్) * విష్ణోః శ్రీరనపాయినీ * అని

శ్రీ విష్ణుపురాణమునందు (1-8-17) చెప్పబడినదానిని ప్రత్యభిజ్ఞాపనము చేయుట యిందు గానసగును, కాంతియు కాంతిమంతుడును పుష్పమును సువాసనయుంబోలె భగవంతుని వీడియెడబాయకుండునదనుట. అవతారములందు గొంతకాలము వీడియుండినను దానివలన నిత్యానపాయినిత్వమునకు గొఱతలేదందురు. * అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా * యని యొకసమయమున సీతాదేవియు, * అనన్యాహి మయా సీతా భాస్కరేణ ప్రభాయథా * యని మఱియొక సమయమున శ్రీరామచంద్రుడును వచించియుండుటను గాని తెలియునది.

(నిరవద్యామ్) అవద్యము లేనిది. క్రింద జెప్పబడిన యుత్కర్షమెల్ల దన కతిశయముగా దలచియుండుట అవద్యము; అట్టి అవద్యము లేనిదనుట. వెన్నెల, తెమ్మెరలు, పువ్వు, చందనము మున్నగువాని మేల్మి యెట్లు పరులయతిశయాధానమునకే యేర్పడినవో యటులే తనగుణములు సర్వేశ్వరునకే యతిశయమును గలుగజేయునవని తలచియుండునది.

(దేవదేవ దివ్యమహిషీం) దీనిభావమును * అప్రతిహతచికీర్షితా * యని శ్రుతప్రకాశికాచార్యులు వెల్లడించిరి. తా నెయ్యది చేయదలపెట్టినను నడ్డులేకుండజేసి ముగింపగల వాల్లభ్యము కలదనుట. బ్రహ్మాదిదేవతలకన్నను సర్వేశ్వరు డెట్లుత్తముడో యట్లే వారల పత్నులకన్నను గొప్పవారలైన సర్వేశ్వరుని తక్కు మహిషులకన్నను నీమె మిక్కిలి గొప్పది యని వివక్షితము.

(అఖిల జగన్మాతరమ్) దేవదేవ దివ్యమహిషి యను

గానే యొక భయముకలుగును. ఆ భయము తొలగుటకై యీ విశేషణము కూర్చబడినది. బిడ్డలవిషయమున మిక్కిలి వాత్సల్యము కలదని యెఱుంగునది. (అస్మన్మాతరమ్) వేదాంతదేశికుల పాఠమున నీ విశేషణము లేదని తెలియుచున్నది. * అత్ర అస్మత్ స్వామిన్నితివత్ అస్మన్మాతర మిత్యపి శ్రీవిష్ణుచిత్తాదయః పఠన్తి; వ్యాచక్షతేచ యామున మునివంశజననేన పునశ్చ విశేషేణ అస్మన్మాతరమితీతి * యని గద్యభాష్యమున గలదు. పలువుర పాఠమున 'అస్మన్మాతరమ'నునది కలదని తెలయుచున్నది. ఈ యెడ ఆచ్చాన్ పిళ్లై వారి వ్యాఖ్యానమునందు 'అఖిలశబ్దమున దామును నంతర్భూతులుకాన తమ్మును గలపికొనుచున్నా'రని కలదు. కోయిల్ పత్తరాపిస్వామి శ్రీకోశమును సేవింపగా నిందు వాక్యస్ఖాలిత్యము కనబడినది. అఖిల శబ్దమున దామంతర్భూతులైయుండియు నఖిలజగమును నొకతట్టున నిలిపి తమ్మొక తట్టుననిలిపి తమ విషయమున వాత్సల్యాతిశయమును గనుగొనిరి కాన విశేషించి యనుగ్రహించుచున్నారు అస్మన్మాతరమ్ అని' అని సరియైనపాఠము కానవచ్చుచున్నది.

(అశరణ్య శరణ్యామ్) సర్వలోక శరణ్యునిచే జపిదువబడిన వారలకుగూడ దాను శరణమై యుండునదనుట. యథాపరాధ దండధరుడగు భగవంతుడు క్షమించునటులొనర్చిరక్షించునదనుట. కాగా నిట్టి శ్రీదేవిని, (అనన్య శరణః అహమ్ శరణం ప్రపద్యే) శరణమొండులేని నేను చరణముల పైబడి యాశ్రయించుచు ననుట. ఇట (ప్రపద్యే) యని యుత్తమపురుషక్రియ యుండుటచేత నేను అను కర్తృపదము

తోచుచున్నదైనను 'అహమ్' అని యనుగ్రహించుట నమ్మి విశేషించి చూపుకొనుట కనుగ్రహించునది. అశక్తిచేతను స్వరూపవిరోధమగుటచేతను నుపాయాంతరములను జేపట్ట లేనివాడనని తనస్థితిని జక్కగా దెలిపినవారైరి. కాగా నీ తొలిచూర్ణికచేత పురుషకారప్రపత్తి నొనర్చినవారైరి.

(మూలము) పారమార్థిక భగవచ్చరణారవిన్దయుగళై కాన్తి కాత్యన్తిక పరభక్తి పరజ్ఞానపరమభక్తికృత పరి పూర్ణానవరత నిత్యవిశదతమానన్య ప్రయోజ నానవధికాతిశయ ప్రియభగవదనుభవ జనితాన వధికాతిశయప్రీతి కారితాశేషావస్థోచితాశేష శేషతైకరతిరూపనిత్య కైంకర్య ప్రాప్త్యపేక్ష యా పారమార్థికీ భగవచ్చరణారవిన్ద శరణాగతి ర్యథావస్థితా అవిరతాఽస్తుమే॥ ౨ ॥

పారమార్థిక - పరమపురుషార్థమైన (ఇయ్యది భక్తికి విశేషణము), భగవచ్చరణారవిన్దయుగళైకాన్తిక - భగవతు చరణనళినములనే పట్టుకొనినదై, ఆత్యన్తిక - ఎల్లప్పుడును నెలకొనునదైన, పరభక్తి పరజ్ఞాన పరమభక్తి - పరభక్తి, పరజ్ఞానము, పరమభక్తి యను వీనిచే, కృత - చేయబడిన, (ఇయ్యది భగవదనుభవమున నన్వయించును) పరిపూర్ణ - నిండినదై, అనవరత - ఎడతెగనిదై, నిత్యమై, నిత్యవిశదతమ- మిక్కిలి విశదమై, అనన్యప్రయోజన - తానే ప్రయోజనమై, అనవధికాతిశయప్రియ - దీనికన్న మించిన ప్రియమైనది వేఱొ

కటి లేదనునట్టిదైన, భగవదనుభవ-భగవంతుని యనుభవము చేత, జనిత - కలిగింపబడిన, అనవధికాతిశయప్రీతి - మిక్కిలి శ్రేష్ఠమైన ప్రీతిచేత, కారిత - చేయింపబడిన (ఇత్యాది నిత్య కైంకర్యమున నన్వయించును), అశేషావస్థోచిత (సర్వేశ్వరుని) ఆస్థానమునందుండుట, అంతఃపురమునందుండుట మున్నగు సకలావస్థలకు దగునట్టిదైన, అశేషశేషతైక రతి రూప సకలవిధకైంకర్యములందును నాశ గలిగియుండుటయే శరీరముగాగల నిత్యకైంకర్యప్రాప్తి అపేక్షయా - నిత్యకైంకర్యమును బడయుటకు దగునట్టుల, పారమార్థికీ - వాస్తవమైన, భగవత్ చరణారవింద శరణాగతిః - సర్వేశ్వరుని చరణములందు జేయబడు శరణాగతి, యథావస్థితా అవిరతా మే అస్తు అది సిద్ధింపవలసిన రీతిని సిద్ధించి మొదతెగక యడియేనికి సిద్ధింపవలయును.

మును (అశరణ్య శరణ్యాం అనన్యశరణః శరణమ్ అహం ప్రపద్యే) యని శ్రీదేవిని శరణుచొచ్చిరి కదా అయ్యది పురుషకార ప్రపత్తి యనున దీవాక్యముచే విశదీకరింపబడినది. "తల్లీ! సర్వేశ్వరుని పాదారవిందములందు అడియేనికి వాస్తవమైన శరణాగతినిష్ఠ కలుగుటకై తమ్ము రక్షకముగా నాశ్రయించుచున్నాను" అని యన్నవారైరి. ఆ శరణాగతిచేత దాము పొందదలచిన ఫలము * ఒళ్విల్ కాలమెల్లామ్' అన్నటుల యావదాత్మభావి నిర్దుష్టమైన కైంకర్యము జేయవలయుననుటయే కాని వేఱొకటికాదని తెలియబఱచినవారైరి. ఒకటో రెండో కైంకర్యములను జేసి తృప్తి బడయుటకాక * శెన్నాల్ కుడైయా మిరున్దాల్ శింగాశన

మామ్ * అనునట్లు సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత కైంకర్యముల జేయవలయుననియు, నటులు కైంకర్యములు చేయజాలకపోయినను నవి చేయవలయునను నభిరుచి యను వర్తించునేని అదియే తాబొందు గొప్పలాభమని తెలిపిన వారైరి. ఎడతెగని భగవదనుభవముకలిగి దానివలన గైంకర్యరుచి కలుగగలదని వచించినవారైరి.

(మూలము) అస్తుతే ॥ ౩ ॥ తయైవ సర్వం సంపత్స్యతే ॥ ౪ ॥

ఇయ్యది శ్రీదేవియొక్క ప్రతివచనము. తే అస్తు-అట్లే నీకు కలుగుగాక, తయాఏవ - ఆ శరణాగతిచేతనే, సర్వం సంపత్స్యతే - మీ యభిమతమెల్లను జక్కగా సిద్ధింపగలదు. ముందు అస్తుమే యని యపేక్షించినవారికి అస్తు తే యనునా శయనుగ్రహమే చాలినదై యుండ, నద్దానికెక్కువగా తయైవ సర్వం సంపత్స్యతే యని చెప్పిన శ్రీదేవియొక్క హృదయ మును శ్రుతప్రకాశికాకారులు వివరించి యనుగ్రహించు చున్నారు, 'స్వసంబన్ధి సంబన్ధి నిస్తరణమపి సర్వశబ్దాభి ప్రేతం' అని. అనగా "మీరు చేయు శరణాగతిచే సిద్ధించు ఫలము మీ వఱకే కలుగునదికాదు. పరంపరగా మీ సంబం ధము సాక్షాత్తుగను బరంపరగను గలవారలకెల్ల నియ్యది ఫలింపగలద"ని శ్రీదేవి శ్రీరామానుజులతో ననుచున్నది.

ఇట్టివరము సర్వేశ్వరుని ముఖమండలమునుండి వచ్చె నని సంప్రదాయము. దానిని వేదాంతదేశికులవారు న్యాస తిలకమున '* ఉక్త్వా ధనఞ్జయ విభీషణ లక్ష్యమాతే ప్రత్యాయ్య లక్ష్మణమునే ర్భవతా వితీర్ణం, శ్రుత్వావరం తదనుబన్ధ మదావలిప్తే నిత్యం ప్రసీదభగవన్మయి రఙ్గనాథ *

3

యను శ్లోకరత్నముచేత సుస్పష్టముగా ననుగ్రహించియున్నారు. ఇంకు 'శ్రుత్వా వరం' అని చెప్పియుండుటచేత భగవంతుడు శ్రీమద్రామానుజులవారికి కొక వర మనుగ్రహించినట్లు తెలియుచున్నది. అది యెట్టిదను విషయమునద్దానికి వ్యాఖ్య నొనర్చిన వారున్నదున్నట్లుగా "వరప్రదాన ప్రకారశ్చేత్థమ్" అని మొదలిడి వచించియున్నారు. కాని పకులు వ్యాఖ్యాన మొనర్చి చూపవలసిన యక్కఱలేకుండగానే వేదాంతదేశికులు తామే మూలమందే "తదనుబన్ధమదావలిప్తేమయి" యని కంఠోక్తిగా వక్కాణించియున్నారు. శ్రీమద్రామానుజులవారికాలమునకును వేదాంతదేశికులకాలమునకునునడుమ నెంతయో వ్యవధానము కలదు. అట్లుండియు, 'ఆ శ్రీరామానుజుల సాక్షాత్ సంబంధము నాకు లేకున్నను బరంపరా సంబంధము నాకుగలదుకాన దానినింబట్టి నాకు ఫలము తప్పక సిద్ధించునని నమ్మి గర్వపడుచున్నాను. ఇట్లు నేను గర్వపడుటకు గారణము శ్రీరంగనాథ నీవు మా కులమునకు బాదైన శ్రీరామానుజులకు ననుగ్రహించిన వరమే సుమా" యని స్పష్టముగా వెల్లడించియున్నారు. కాగా నట్టి వరప్రదానమునకు బూర్వ మాశ్రీదేవియు దన ముఖారవిందము తెఱచి యట్టి వరమొకదాని ననుగ్రహించినటుల శ్రీ శ్రుతప్రకాశికా భట్టరువారు వ్యాఖ్యానమొనరించినది సత్సంప్రదాయ సిద్ధార్థ మనుటకు సందియము లేదు.

(మూలము) అఖిలహేయ ప్రత్యనీకకల్యాణైకతాన స్వేతర
సమస్తవస్తు విలక్షణానన్త జ్ఞానానన్దైక స్వరూప!

ఇక నిదిమొదలు నికమీద శ్రీమన్నారాయణ! అశరణ్య

శరణ్యా! యని శ్రీరంగనాథుని బలువిధములుగా బిలిచి "అనన్య శరణః త్వత్పాదారవిన్దయుగళం శరణమ్ అహం ప్రపద్యే" యని తమ శరణాగతిని విన్నవించి ముగించుచున్నారు. ఇందు 'అఖిలహేయ' యని తొడంగి 'జ్ఞానానన్దైక స్వరూప!' యనువఱకు మొదటి సంబోధనము.

అఖిలహేయప్రత్యనీక-ఎట్టిహేయమైన దోషములకును బ్రతిమైనదై, కల్యాణ ఏకతాన - మంచివానికి ముఖ్యమైన నెలవై, స్వేతర సమస్తవస్తు విలక్షణ - తనకన్న నితరములైన సకల వస్తువులకన్నను విలక్షణమై, అనన్త - సర్వవ్యాపియైనందున దేశపరిచ్ఛేదరహితమై, సర్వకాలవర్తియగుటచేత కాలపరిచ్ఛేదరహితమై, సకలవస్తువులును దానే యయియుండుటం జేసి వస్తుపరిచ్ఛేదరహితమై, (కాగా నిట్లు ముత్తెఱంగులగు పరిచ్ఛేదములు లేనందున ననంతమయియుండుట) ఇట్లు అనంతమై, జ్ఞానఆనన్ద ఏకస్వరూప! - స్వయంప్రకాశమగుటచేత నానందమే రూపము నైయుండువాడా! అని యింతదనుక దివ్యాత్మస్వరూపమును జెప్పిరి. "స్వరూపరూపగుణవిభూతుల"ను వానిలో నిట్లు స్వరూపమును వర్ణించి యికరూపమును వర్ణించుచున్నారు.

(మూలము) స్వాభిమతానురూపైక రూపాచిన్త్య దివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌన్దర్య సౌగన్ధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనన్త గుణనిధి దివ్యరూప!

రూపమనగా దివ్యమంగళ విగ్రహము, అది యెట్లున్నదనిన;

స్వాభిమత - దివ్యాత్మస్వరూపమునకన్న నభిమతమై, అను రూప - తగినదై, ఏకరూప-షడ్భావవికారము లొక్కటియు లేనిదై, అచిన్త్య - ప్రాకృత వస్తుసజాతీయమని తలపగూడ నిదై, దివ్య - అప్రాకృతమై, అద్భుత - క్షణక్షణము నపూర్వ మైనదిగ వెలయునదై, నిత్య - స్వరూపగుణములవలె ననాది నిధనమై, నిరవద్య - దుర్లభత్వమున్నగు నవద్యము లేనిదై; మఱియు నిత్యనిరవద్యయని యొకపదముగజేసి యెల్లప్పుడు నిరవద్యమైయుండునదనియు ననదగును. అనగా నెప్పటికిని స్వార్థము గాకుండునది * అడియోము కే- యెమ్బెరుమానల్లీ రో సీర్ * అనునట్లుగ నెక్కాలమందును దాసులకుగా నే తానుండుట) నిరతిశయ ఔజ్జ్వల్య-దీనినిమించిన మఱియొక వెలుగు లేదనదగినదై, సౌందర్యసౌగన్ధ్య సౌకుమార్యలావణ్య యౌవనాది అనన్త గుణనిధి - అవయవశోభయగు సౌందర్య మును, దివ్యపరిమళ ప్రచురమైయుండుటయును, శ్రీ దేవియు గనువిచ్చి చూడరాని సుకుమారస్వభావమును, సముదాయ శోభయగు లావణ్యమును, నెల్లపుడు ప్రాయమువీడని యౌవన మును నివిమున్నగు నపరిమితగుణముల కునికిపట్టుగనుండున దైన, దివ్యరూప - దివ్యమంగళ విగ్రహమునుగలవాడా! ఈ వాక్యమున నీచోట దివ్యపదమున్నను గ్రింద 'అచిన్త్య దివ్యాద్భుత' యని దివ్యపదమును బ్రయోగించుట పునరుక్తి దోషము కలదికాదు. ఎన్నిమాఱులు పేర్కొన్నను జాలదు కదా! "దివ్యశబ్దద్వయం ద్రవ్యసంస్థాన వైలక్షణ్యపరమ్" అని శ్రుతప్రకాశికాకారులును, "దివ్యశబ్దాద్ద్రవ్యతస్సన్నివేశాదిభిశ్చ వైలక్షణ్యపరౌ; అప్రాకృతస్థానవర్తిత్వా ప్రాకృతత్వ పరౌ వా"

యని వేదాంతదేశికులును ననుగ్రహించిరి. ఇందు రెండవ నిర్వాహము ఆచ్చాన్ పిళ్లైవారు పేర్కొన్నది.

కాగా నిట్లు విగ్రహవైలక్షణ్యమును బేర్కొని, యిక దివ్యాత్మగుణముల ననుగ్రహించుచున్నారు.

(మూలము) స్వాభావికానవధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజస్సౌశీల్య వాత్సల్యమార్దవార్జవ సౌహార్ద సామ్యకారుణ్య మాధుర్యగాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్యధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞతాద్యసంఖ్యేయ కల్యాణగుణ గణౌఘ మహార్ణవ !

'స్వాభావిక,అనవధికాతిశయ'యను రెండువిశేషణములును నిక జెప్పబోవు సకలగుణములందును నన్వయించును. స్వాభావికము లంటు తమకన్న మించిన వెందును లేనటులుండు షాడ్గుణ్యము మున్నగు కల్యాణగుణసమూహములకు సముద్రమువంటివాడా! అనుట. ఈ గుణములు స్వాభావికములైయుండుట యనగా - నీటికి జల్లదనమువలెను, నగ్నికి వెచ్చదనమువలెను ధర్మి యుండునపుడే తవిలియుండుట. ఒకదినముపుట్టి మఱియొక దినము గిట్టునవికాక యాత్మ యున్నంతవఱకు నొప్పియుండు నవి. ఇందువలన నిత్యముక్తుల గుణములకన్న వైలక్షణ్యము చెప్పబడినది. వారి గుణములు భగవంతునియిచ్ఛచే గలిగినవి కావున ననన్యాధీనత్వమగు స్వాభావికత్వ మక్కడ లేదు. అనవధికాతిశయత్వమనగా నొక్కొక్కగుణము నెల్ల కనరాకుండు

నవి. పయిజెప్పినగుణములందు గొన్ని యితరవ్యక్తుల యెడ లను గలవైనను నక్కడ నొకయెల్ల కలిగియుండును. అట్లు గాక యివి భగవంతునెడ నింతకు మించినది లేదనదగి మించి యొప్పును. శ్రీభాష్యమున * స్వభావతో నిరస్త నిఖిలదోషా నవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణః పురుషోత్తమోభి ధీయతే * యను పట్టునకు వ్యాఖ్యాన మొనర్చుచు శ్రుత ప్రకాశికాకారులు అనవధికాతిశయ పదము చేత నిత్యసిద్ధుల వేర్పఱుచుచున్నదని యొక యోజనను బేర్కొని " అనుషక్తేన స్వభావత ఇతిపదేనవా నిత్యసిద్ధవ్యావృత్తిః; తేషాం తాదృ శగుణకత్వం హి భగవన్నిత్యేచ్ఛాధీనమ్ " అని, యనంతర యోజనను బేర్కొనినదిట నను సంధింపదగినది.

ఇక నిట జెప్పిన గుణముల వివరింతుము. జ్ఞాన బలై శ్వర్య వీర్యశక్తి తేజస్సులనునాఱును షాడ్గుణ్య మనబడును. ఇవియే తక్కు గుణముల కన్నింటికి నాధారమైయుండును. వీనిలో జ్ఞానమనునది యొకకాలమందే యన్నింటిని నెల్లప్పుడు యున్నదున్నట్లు తెలిసికొనుట. బలమనగా-సంకల్పమాత్రము సకల పదార్థములను శ్రమములేక ధరించుశక్తి. ఐశ్వర్యమనగా - సమస్త వస్తువులను నియమింపగల సామర్థ్యము. వీర్యమనగా- జగమునకుపాదానకారణముగనుండియు స్వరూపవికారమిం చుకయు లేకుండుట. శక్తియనగా-అఘటితఘటనాసామర్థ్యము. తేజస్సనగా - దేనికిని సహకారి నపేక్షింపకుండుట. ఇట్టి షాడ్గు ణ్యమును బేర్కొన్నతరువాత దీనిలోనుండితోచు కల్యాణగుణ ములను 'సౌశీల్య' యని తొడంగి యనుగ్రహించుచున్నారు.

సౌశీల్యమనగా గొప్పవారు తక్కువవారు భేదములేక

కలసిమెలసియుండుట. ఇదియే శీలగుణ మనబడును. వాత్సల్య మనగా - ఆ నాడీనిన దూడ యొడలిపైని ముఱికి నాదరించి భుజించు గోవుంబలె దాసులదోషములను భోగ్యముగా గొనుట. మార్దవమనగా - ఆశ్రితుల విరహము నోర్వలేని మృదుత్వము. ఆర్జవమనగా - త్రికరణములచేతను నొకతీఱు ననేయుండుట. ఋజుత్వమనియు ననబడును. దీని కెదురయిన గుణము కౌటిల్య మనబడును. సౌహార్దమనగా - ఎల్లప్పుడు మేలే తలచుచుండుట. సామ్యమనగా - జాతిగుణ వృత్తాదు లందు నెచ్చు తగ్గులుచూడ కందఱకొక రీతిగనే యాశ్రయింప దగియుండుట. కారుణ్యమనగా - దుఃఖించుచున్న వారలయెడ నయ్యో యని కనికరముచూపుట. మాధుర్యమనగా - చంప దలచు క్రూరచిత్తముగల శత్రువులకును నింపుగూర్చువాడై యుండుట. గాంభీర్యమనగా - ఆశ్రితులకు నొనర్పదలచిన వాని నితరులెవ్వరు తెలిసికొనరానట్టులు లోతగు చిత్తము కలిగియుండుట. ఔదార్యమనగా - ప్రతిఫలమును గోరక కైకొనుచున్న కొలదిని గొఱతవడక వలసినదెల్ల నొసగగలి గినవాడై యుండుట. చాతుర్యమనగా-ప్రతికూలురనుగూడ ననుకూలురుగా జేసికొనుచదురు. స్థైర్యమనగా - దాసుల నొకప్పుడును జేవిడువకుండు పట్టుదల.

ధైర్యమనగా - ప్రతిపక్షము బలముకలిగియుండినను దృణీకరించియుండుట. శౌర్యమనగా-ప్రబలులైయున్న శత్రు వులు గుంపులుగా నెదురొ్్కన్నను సహాయమునుగోరక తెగు వతో జొచ్చునేర్పు. పరాక్రమమనగా - అట్లు తా జొచ్చిన చోట నవలీలగా నెదిరిని భంగపఱుచు నేర్పు.

(సత్యకామ - సత్యసంకల్ప) అను నీ రెండును నిక్కడ భావ ప్రధాననిర్దేశ మగుటంబట్టి సత్యకామత్వము, సత్యసంకల్పత్వమునని గ్రహింపవలయును. సత్యకామత్వమనగా గోరిన వెల్ల గొఱతలేక సిద్ధించియుండుట. సత్యసంకల్పత్వమనగా-ఏదిచేయదలపెట్టినను నడ్డులేకచేసి ముగించుశక్తి. కృతిత్వమనగా-దాసులకై పనులజేయుచునేయుండుట. కృతజ్ఞత్వమనగా-దాసులు చిన్నమేలొకటిచేసినను దాని నేకాలమందును మఱచిపోకుండుట. కాగా నిట్టి అసంఖ్యేయ కల్యాణగుణగణౌఘమహార్ణవ - కడముట్ట లెక్కింప నలవికాని కల్యాణగుణములను ప్రవాహములకు గడలింబోలినవాడా !

ఇట్టులు కల్యాణగుణముల నభివర్ణించి యిక దివ్యభూషణములను వర్ణించుచున్నారు.

(మూలము) స్వోచిత వివిధ విచిత్రానన్తాశ్చర్య నిత్యనిర
వద్య నిరతిశయ సుగన్ధ నిరతిశయ సుఖస్పర్శ
నిరతిశయౌజ్జ్వల్య కిరీట మకుట చూడావ
తంస మకరకుణ్డల గ్రైవేయక హార కేయూర
కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తా దామోదర
బన్ధన పీతాంబర కాంచీగుణ నూపురాద్య
పరిమిత దివ్యభూషణ !

ఆత్మస్వరూపమున కలంకారముగ జ్ఞానముమున్నగు దివ్యగుణములను ముందు పేర్కొనిరి. దివ్యమంగళ విగ్రహమున కలంకారమైన దివ్యభూషణముల నిక్కడ బేర్కొనుచున్నారు.

స్వోచిత - తనకు దగినవై, వివిధవిచిత్ర - పలువిధము

లగు వై చిత్రినిగలిగినవై, అనన్త - అపరిమితములై, ఆశ్చర్య- అచ్చెరువు పుట్టించునవై, నిత్య-ఎల్లప్పుడునుండునవై, నిరవద్య- ఎట్టిదోషసంబంధమును లేనివై, (లేదా, నిత్య నిరవద్యయని యొకపదముగాగొని ఎల్లప్పుడును నిరవద్యములై యనియు నన దగును.) నిరతిశయ సుగంధ-తన్నుబోలినదియు మించునదియు లేనిపరిమళమునుగలవై, నిరతిశయ సుఖస్పర్శ-ఏకాలమందును నూడదీయరానట్టులు) సాటిలేని సౌకుమార్యమునుగలవై, నిరతిశయ ఔజ్జ్వల్య - తన్నుబోలినదియు మించినదియు లేనట్టి కాంతినిగలవైయుండు, (కిరీటేత్యాది) కిరీటమనియు, మకుట మనియు, చూడావతంసమనియు నివి పర్యాయములుగోలె గాన వచ్చినను నవాంతరభేదములనుబట్టి వేర్వేఱుగా వ్యవహరింప బడినది. కొండె, తొప్పారము, తురాయి యని వ్యవహరించుట నిటగొనునది. నమ్మాళ్వారులు తిరువృత్తమున * పారళన్ద పేరరశే! ఎమ్విశుమ్బరశే! ఎమ్మైనీత్తువజిత్తోరరశే * యను పాశురమున నెమ్బెరుమానునకు ముత్తెఱంగులగు సామ్రాజ్యము ననుగ్రహించిరి. ఆచార్యహృదయమునందు * "మూన్ఱుముడిక్కుఱియ ఇళవరశుక్కు" నని యనుగ్రహించుటయు నీ పాశురము ననుసరించియే. సౌలభ్యమునకయి తాల్చిన బొమిడిక మొకటియు, బరత్వమునకయి తాల్చిన బొమిడిక మొకటియు, ప్రణయిత్వమునకయి తాల్చిన బొమిడిక మొకటి యనియు నిట్టులు మూడు బొమిడికముల నాళ్వారు లనుభవించి పాశురమునుగూర్చియుండుటచేత నమ్మాళ్వారుల శ్రీచరణముల నాశ్రయించి యుజ్జీవించినవారగు శ్రీమద్రామానుజులును నిట (కిరీట-మకుట - చూడా

వతంసమని) ముత్తైలంగుల బొమిడికముల ననుగ్రహించిరనుట రస్యమయిన రహస్యార్థము.

(చూడావతంస) దీని నొకపదముగాగొనవచ్చును; కాక చూడయనియు నవతంసయనియు వేర్వేఱుగాను గొనవచ్చును. క్రమముగా చూడాభరణమును కర్ణాభరణమును జెప్పబడినవి. మకరకుణ్డల - మకరాకృతిగల కుండలములు, గ్రైవేయక - మెడలోదాల్చుసొమ్ములు, హార - వక్షస్థలమునందు దాల్చు ముత్యాలదండలు, కేయూర బాహుపురులు, కటక-ముంజేత దాల్చువలయములు. శ్రీవత్స-ఇయ్యదిముందు చెప్పిన సొమ్ములవలెగాక తిరుమేనిలో నొక సుడియేయైనను నిదియు నొక సొమ్ముగ గానవచ్చుటంబట్టి యిట జెప్పబడినది. శ్రీవత్సమనగా - మచ్చ, కౌస్తుభ - ఱొమ్మునదాల్చు శ్లాఘ్యమైనరత్నము, ముక్తాదామ-ఏకావళి, త్రిసరము, పంచసరము ననబడు ముత్యాలదండలు, ఉదరబన్ధన-నడుముపట్టి, పీతాంబర - పురుషోత్తమ లక్షణమగు పచ్చవలువ, కాఞ్చీగుణ - ఆ పీతాంబరముపై ధరించు మొలత్రాడు, నూపుర - అందె, ఆది శబ్దముచేత యజ్ఞోపవీతము, నుంగరము మున్నగునవి చెప్పబడినవి. * శెఙ్గమలక్కళలిల్ శిత్తిదళ్ పోల్ విరలిల్ శేర్ తిగళాళిగళుమ్ కిణ్కిణియుమ్ అరైయిల్ తఙ్గియపొన్ వడముమ్ తాళనన్మాదుళైయిన్ పూవొడు పొన్మణియుమ్ మోదిరముఙ్కిఱియుమ్, మఙ్గల వైమ్బడైయుమ్ తోళ్వళైయుమ్ కుళైయుమ్ మకరముమ్ వాళికళుమ్ శుట్టియుమ్ * అను పెరియాళ్వార్ తిరుమొళియు నిట ననుసంధింపదగును. ఇట్టు లపరిమితదివ్యభూషణములను గలిగినవాడా!

ఇక దివ్యాయుధముల జేర్కొనుచున్నారు.

(మూలము) స్వానురూపాచింత్య శక్తి శంఖచక్రగదా శార్ఙ్గాద్యసంఖ్యేయ నిత్యనిరవద్య నిరతిశయ కల్యాణ దివ్యాయుధ !

స్వానురూప - తనకుదగినవై, అచింత్యశక్తి - మనస్సుచే దలచిచూడనైనవలనుగాని శక్తినిగలిగిన, శంఖచక్రగదా శార్ఙ్గాది-శంఖము చక్రము గద విల్లు మున్నగు, అసంఖ్యేయ-లెక్కింపనలవికానివై. నిత్యనిరవద్య - దినములు గడవగడవ మొక్కవోనివై యేనాడు నొక తీఱునసే పరగునవై, నిరతిశయ కల్యాణ - సాటిలేని శోభనుగలిగించునవైయున్న, దివ్య ఆయుధ - దివ్యాయుధములనుగలవాఁడా ! ఈ వాక్యమున 'గదా' యనుదాని తరువాత అసి యనుదానిని గలిపికొని యొకపాఠమున్నది. దానిని విడనాడిన పాఠమే నంబిళ్లగారి మదికి నచ్చినది.

ఇక దివ్యమహిషులతో గలిసియుండుట ననుభవించుచున్నారు.

(మూలము) స్వాభిమత నిత్యనిరవద్యానురూప స్వరూపరూప గుణవిభవైశ్వర్య శీలాద్య నవధి కాతిశయా సంఖ్యేయ కల్యాణగుణగణ శ్రీవల్లభ !

శ్రీదేవి విషయమున గూర్పబడిన మొదటిచూర్ణికలో గూర్పబడిన విశేషణమే యిక్కడను గూర్పబడినది. అనుభవ రసికులకుగల యాదరాతిశయము ప్రేరేపబలుకుపలుకులుగాన వీని కిట బునరుక్తిదోషమని సందియపడ నక్కఱలేదు. ఇట

ఆచ్చాన్ పిళ్లైవారి శ్రీసూక్తిని దిలకింపుడు. "మొదటి చూర్ణికలోను నీగుణములు చెప్పబడియుండ మరల నిట జెప్పుట పునరుక్తము కాదా యన్నచో, వీరు తా మితరుల కుప దేశింపక తామే యనుభవించుచు నద్దానగలిగిన యాదరాతి శయమున బలుకుపలుకు లగుటంబట్టి పునరుక్తిదోషములేదు ; లేదా, అక్కడ శరణ్యతకు ననుకూలముగ జేర్చినారి; ఇక్కడ వాల్లభ్యమునకు ననుగుణముగా జేర్చుచున్నారు" అని.

స్వాభిమతములుగను నిత్య నిరవద్యములుగను ననురూపములుగను నుండు స్వరూపరూప......కల్యాణగుణములుగల శ్రీమహాలక్ష్మికి వల్లభుడైనవాడా! అనుట. భగవన్నారాయణాభిమతేత్యాది చూర్ణికలో వివరించిన విధమును గని తెలియునది. శ్రీవల్లభ!—శ్రీదేవికివల్లభుడైనవాడా! యనియు శ్రీదేవిని వల్లభగా గలిగినవాడా! యనియు నిఱు తెఱంగులు గాగొనునది. ప్రథమపక్షమున శ్రీదేవికిని శ్రీకరుం డనియనుట. ద్వితీయపక్షమున శ్రీదేవి చెప్పినమాటను జవ దాటక యామెకు విధేయుడై యుండువాడనుట.

ఏవంభూత భూమినీళానాయక!—మున్ను 'స్వాభిమత' యని తొడగి 'కల్యాణగుణగణ' యను వఱకు జెప్పిన దానిని (ఏవంభూత) యని యతిదేశించుచున్నారు. శ్రీదేవికి జెప్పు గొప్పతనము నెల్ల భూదేవికిని నీళాదేవికిని సమానము లనుట. * కుమ్రిల్ కోవలర్ * (తిరువిరుత్తమ్) అను నమ్మాళ్వారుల పాశురమును జూచునది.

ఇక మున్ను చెప్పిన వెల్ల నడవిగాచిన వెన్నెలచంద నము గాక నిత్యభోక్త లమరియుండుట చెప్పబడుచున్నది.

(మూలము) స్వచ్ఛందానువర్తి స్వరూపస్థితి ప్రవృత్తి భేదా
శేష శేషతైక రతిరూప నిత్యనిరవద్య నిరతి
శయ జ్ఞానక్రియైశ్వర్యాద్యనన్తగుణగణ శేష
శేషాశన గరుడ ప్రముఖనానావిధానన్త పరి
జన పరిచారికా పరిచరిత చరణయుగల !

ఆదిశేషుడు, విష్వక్సేనుడు, గరుత్మంతుడు మున్నగు నపరిమిత పరిజనములును, పరిచారికలును పాదారవిందముల సన్నిధిని నిత్యకైంకర్యముచేయుచుండ నొప్పియున్నవాడా! యను చున్నారు. ఆ నిత్యసూరు లెట్టివారలనగా; స్వచ్ఛందాను వర్తి స్వరూపస్థితి ప్రవృత్తిభేద-తమహృదయము ననుసరించిన స్వరూపస్థితి ప్రవృత్తులు కలవారలుగను, అశేష శేష తైకరతి రూప - సకలవిధకైంకర్యముల నొనర్పగోరిక కలిగియుండు టయే రూపుగాగలవారలుగను, నిత్యనిరవద్య నిరతిశయజ్ఞాన క్రియా ఐశ్వర్యాది అనన్త (కల్యాణ) గుణగణ - ఏ కాలమం దును దోషములేక నిస్సమాభ్యధికమైన జ్ఞానము వ్యాపారము నియమనము మున్నగు ననంతకల్యాణగుణ సమూహములను గలవారలుగను నుందురు. 'నిత్య నిరవద్య' యను దాని నిడు శేష శేషాశనాదులకు నాలుగు విశేషణములు కూర్చి నట్లగును. స్వాధీన స్వార్థకైంకర్యము నొనర్చుటయగు నవ ద్యము లేనివారలని భావము. నిత్యనిరవద్యత్వమును జ్ఞానా దులకు విశేషణమొనర్చినను నీభావమేర్పడును. దాస్యమున కనుకూలమైన యసంకుచిత జ్ఞానము, క్రియా - ఆజ్ఞాసమునకు దగిన చేతలును, ఐశ్వర్య - పరుల నియమించు నధికారమును నివి మున్నగాగల గుణములను గలవారలనుట.

శేషాశనులని సేనైముదలియారులకు శుభనామము. * త్వదీయ భుక్తోజ్ఝిత శేషభోజినా...ప్రియేణ సేనాపతినా* యను నాళవందారుల శ్రీసూక్తిని దిలకించునది. పరిచారికా- అనుగ్రహా, విమలా, కాన్తి, వారుణీ, సుకీర్తి, రుద్రా, సూత్ర వతీ మున్నగువారలను బరిచారికలనుట. శ్రీరంగరాజస్తవ మున * లీలా లతా కృపాణీ * ముకుళితనళినాః* యను శ్లోకములందును గాంచునది. * మదిముక మడద్దైయర్ * యని యాళ్వారులును బేర్కొ-నిరి.

ఇక నిట్టి భగవంతుడు వెలసియుండుచోటును జెప్పు చున్నారు.

(మూలము) పరమయోగి వాఙ్మనసా పరిచ్ఛేద్య స్వరూప స్వభావ స్వాభిమత వివిధవిచిత్రానన్త భోగ్య భోగోపకరణ భోగస్థాన సమృద్ధానన్తాశ్చర్యా నన్త మహావిభవానన్త పరిమాణ నిత్యనిర వద్య నిరతిశయ వైకుణ్ఠనాథ !

పరమయోగియని మొదలిడి వైకుంఠనాథ యను సంతవఱకు నొకవాక్యముగనే గ్రహించునది సర్వాచార్య సమ్మతము. పరమయోగి వాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూప స్వభావ యను దానివఱకు బ్రత్యేకవాక్యము గా గైకొని దీనిని బ్రత్యేకసంబో ధనముకాగొని వచించువారును గలరని శ్రీవేదాంతదేశికుల భాష్యము వలన దెలియవచ్చెడిని. శ్రుతప్రకాశికాచార్యులట్లే గైకొనినట్టు లవ్వారి వ్యాఖ్యవలన దెలియుచున్నది. అట్టులు వచించి యనుగ్రహించినవారే వెంటనే "పరమయోగీత్యా

దిశం దేశవిశేషణంవా; తథా శ్రీవైకుణ్ఠ గద్యోక్తేః యని యనుగ్రహించియుండుటచేత నంతటిని నొక వాక్యముగా గొనుటయే శ్రేష్ఠము.

పరమయోగి వాఙ్మన సాపరిచ్ఛేద్య స్వరూపస్వభావ ముగను, స్వాభిమత వివిధవిచిత్రానన్త భోగ్య భోగోపకరణ భోగస్థాన సమృద్ధముగను, అనన్తాశ్చర్యముగను, అనన్త మహా విభవముగను, అనన్తపరిమాణముగను, నిత్యముగను, నిర వద్యముగను (లేదా, నిత్యనిరవద్యముగను) నిరతిశయముగను నుండు వైకుంఠలోకమునకు నాథుడవైనవాడా! యని గ్రహించునది. ఇకమీద శ్రీవైకుంఠగద్యమున * దివ్య పురుషైర్మహాత్మభిరాపూరితే, తేషామపి ఇయత్పరిమాణమ్ ఇయదైశ్వర్యమ్ ఈదృశస్వభావమితి పరిచ్ఛేత్తుమయోగ్యే * యని యనుగ్రహించుటనుగొని యిటు తొలివిశేషణమును వివరించుట.

పరబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించినవారలై శ్వేతద్వీపవాసులైన పరమయోగులచేతను శ్రీవైకుంఠము యొక్క స్వరూపమును స్వభావమును వేరొకనను దలంప నైనను బరిచ్ఛేదింపరానిది. శుద్ధసత్త్వమైయుండురూపము. భోగ్యతమమై యుండునది స్వభావము. ఈ రెండును బరమ యోగులకైన వేరొకన నలవికానివి. తలంచిచూడ నరుదై యుండును.

(స్వాభిమతేత్యాది) తన కభిమతములై పలువిధములై యద్భుతములై యపరిమితములైయుండు భోగ్యవస్తువులును, భోగోపకరణవస్తువులును భోగస్థానములును నిండుగగలిగి

యుండునది శ్రీవైకుంఠము. అప్రాకృతములైన శబ్దాది విషయములు భోగ్యవస్తువులు; తాదాల్పు పూలదండలును బరిజన పరిచ్ఛేదములు మున్నగునవియును భోగోపకరణములు; అప్రాకృత రత్నమయమంటపములు క్రీడాపర్వతములు మున్నగునవి భోగస్థానములు. వీనితో నిండియుండున దనుట.

అనన్తాశ్చర్య - నిత్యము నపూర్వవస్తువవలెనే యనుభవింపదగినదై యుండుటంబట్టి మిక్కిలి యాశ్చర్యమైయుండును; అనన్త మహావిభవ-రత్నభూషణ సింహాసనాదులును ఉద్యాన నదీ తటాకాదులును లెక్కలేనన్ని యుండుటంబట్టి యనంతమైన మహావిభవములను గలిగినదై యుండును. అనంతపరిమాణ - ఆయామ విస్తారములచే నెల్లలేక వెలసియుండును, నిత్యనిరవద్య - అనిత్యమై యవద్యములతో నిండియున్న స్థానములకన్న విశిష్టమైయుండును. పరతిశయ - కాగా నిట్లమరియుం డుటంబట్టి తనకు మించినచోటు వేఱొకటి లేదన బరగును. ఇట్టి శ్రీవైకుంఠలోకమునకు నాథుడవైనవాడా!

(మూలము) స్వసఙ్కల్పాను విధాయి స్వరూపస్థితి ప్రవృత్తి
స్వశేషతైకస్వభావ ప్రకృతి పురుషకాలా
త్మక వివిధ విచిత్రానన్త భోగ్యభోక్తృవర్గ
భోగోపకరణ భోగస్థానరూప నిఖిలజగదు
దయ విభవ లయలీల!

సకలజగములయు సృష్టిస్థితి పరిహారములను లీలగాగలవాడా! యనుట. ఆ సకలజగము నెట్టిదనిన, స్వసఙ్కల్పాను విధాయి స్వరూపస్థితి ప్రవృత్తి-తన సంకల్పము ననుసరించిన స్వరూప స్థితి ప్రవృత్తులను కలదై యుండును.

(ఈ విశేషణము ప్రకృతి పురుష కాలములం దన్వయిం చును) స్వశేషత్రైకస్వభావ - తనకు శేషమైయుండుటయే స్వభావముగా కలది. (ఇదియు ప్రకృతి పురుష కాల విశేషణము) ప్రకృతియు పురుషుడును కాలము ననునివియే జగత్తయి యుండుటంబట్టి 'ప్రకృతి పురుషకాలాత్మక' యనుట. వీని స్వరూపస్థితి ప్రవృత్తులు భగవంతున కధీనములై యతనికే శేషభూతములై యుండుటంజేసి ముందు రెండు విశేషణములు కూర్చబడినవి. ఈ మూటిలోను పురుషు డనబడు చేతనుడు భోక్తగను, ప్రకృతియనబడునది (ప్రకృతిని జెప్పుట ప్రాకృత వస్తువు లన్నింటికి నుపలక్షణము) భోగ్యభోగోపకరణ భోగ స్థానములుగను నుండును. ఈ జగము కాలకార్యమని చూపుటకై కాలమును జేర్చి వచింపబడినది. కాలమును భోగోప కరణములందు జేర్పవచ్చును. కాగా, ప్రకృతి పురుషకాలాత్మకమైన, వివిధ - పలువిధములుగను, విచిత్ర - విచిత్రములుగను, అనంత - అపరిమితములుగనునుండు, భోగ్యభోక్తృవర్గ భోగోపకరణ భోగస్థానరూప-భోగ్యమును భోక్తృవర్గమును భోగోపకరణములును భోగయోగ్యమగు స్థానవిశేషములును నను వీనిని స్వరూపముగాగల,నిఖిలజగత్-సకలలోకములయు, ఉదయవిభవలయ-సృష్టిస్థితి సంహారములను, లీల - క్రీడగాగలిగినవాడా!

సత్యకామ—తలచునవెల్ల నెఱవేరగలిగియుండువాడా!

సత్య సఙ్కల్ప—తలంచినవెల్ల జేసి ముగింపగలిగిన వాడా!

పరబ్రహ్మభూత—పరబ్రహ్మమని పొగడబడువాడా!

పురుషోత్తమ—ఉత్తమపురుషుడా !

మహావిభూతే—ఎల్లలేని నియామ్యవస్తువుల నేలువాడా !

శ్రీమన్—లక్ష్మీపతియగువాడా !

నారాయణ—నారాయణు డనుపేర వెలసియుండువాడా !

వైకుణ్ఠనాథ—నిత్యవిభూతి కధిపతియగువాడా !

(ఈ ఎనిమిది సంబోధనములును నిక జెప్పబడనున్న విశేషణములును జాలవఱకు మున్ను చెప్పబడిన సంబోధనముల చేత జరితార్థములేయైనను, ఇక్కలి దప్పినిగొన్నవాడు నీటిలోబడి జలము పలువిధముల నుపయోగించుకొనునట్లు వీరిమదిలోని తహతహ విలక్షణమై యుండుటంజేసి వీని బునరుక్తి శంకను గొనుటయు దాని బరిహరించుకొన వెరవఱయుటయు నక్కఱలేదు.)

అపారకారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యైశ్వర్య సౌన్దర్య మహోదధే :—

ఎల్లలేని కరుణ, శీలము, వాత్సల్యము, ఔదార్యము, ఐశ్వర్యము, సౌందర్యము నను కల్యాణగుణములకు గొప్ప సముద్రమైనవాడా ! (వీని వివరణ క్రింద జేయబడియున్నది.) ఇక్కడ నైశ్వర్యమును జేర్చియుండుటమాత్రము విశేషించి గుర్తింపదగినది. "సంసారిణాం స్వరక్షణ విఘాతకత్వేపి తాన్ స్వాతన్త్ర్యేణ నియమ్య రక్షితుం శక్త ఇత్యభిప్రేత్య ఐశ్వర్యమిత్యుక్తమ్" అనుట శ్రుత ప్రకాశికాచార్యుల వ్యాఖ్యాన శ్రీ

సూక్తి. వేదాంతదేశికు లిద్దానిని బోధించి యనుగ్రహించి యుండుటను జూడుడు. "ఐశ్వర్యస్య కథన మిహ అనాది కాలం స్వరక్షణ విపరీతవృత్త్యా కేనచిద్వ్యాజేన స్వయమేవ నియమ్యాభిముఖీకరోతీతి జ్ఞాపయితుమ్" అనిరి. * ఇత్థైవి త్తైన్యయుక్ * అని ఆళ్వారు లనుగ్రహించియుండుటం దవిలి యిట జెప్పబడినదనుట.

అనాలోచిత విశేష అశేష లోకశరణ్య!—జన్మవృత్త జ్ఞానములందు నెచ్చుతగ్గు లాలోచింపక యెట్టివారైన వచ్చి యాశ్రయించునట్లు లట్టివారలకెల్ల శరణ్యమై వెలసినవాడా! అనాలోచిత విశేషం యథాతథా అశేషాణాం లోకానాం శరణ్య! అనుట.

ప్రణతార్తిహర.—ఆశ్రయించినవారల యార్తిని దీర్చువాడా!

ఆశ్రితవాత్సల్యైకజలధే!—దాసుల తప్పుల నెల్ల మేలుగాగొనుట యను గుణమునకు సముద్రమైనవాడా!

అనవరత విదిత నిఖిలభూత జాత యాథాత్మ్య - సకల పదార్థములయు సత్యము నెల్లప్పుడుచు దెలిసికొనువాడా! దీనివలన సర్వజ్ఞత్వము చెప్పబడినది. ఆకిఞ్చన్యము, అనన్య గతిత్వము మున్నగు నా స్థితిని నేను విన్నపముచేయ నక్కఱ లేకుండ నీవే తెలిసికొన సమర్థుడవగువాడవుకదా యనుట.

అశేష చరాచరభూత నిఖిల నియమన నిరత.—జంగమస్థావరములగు సకలపదార్థములను నియమింప సమర్థుడ వగువాడా! ఇట్లు నన్ను నీచరణకమలముల సన్నిధిని నిలువ జేసినవాడవు నీవే కదా యనుట.

అశేష చిదచిద్వస్తు శేషిభూత!—సకల చేతనా చేతనములకును శేషియగువాఁడా! నాయెడ గైంకర్యమును గొనవలసినది మీ బాధ్యతయేకదా యనుట.

నిఖిల జగదాధార!—సకల జగములకును నాధారమై యుండువాఁడా!

అఖిల జగత్స్వామిన్!—సకల జగములకును స్వామియగువాఁడా!

అస్మత్స్వామిన్!—విశేషించి నాకు స్వామివైనవాఁడా!

సత్యకామ!—అవాప్త సమస్తకాముడగువాఁడా!

సత్యసఙ్కల్ప—ఎవరిచేతను నడ్డగింపరాక చక్కగా నెఱవేరునట్టి సంకల్పములను గలవాఁడా!

సకలేతర విలక్షణ—తక్కిన యందఱికన్న నన్ని విధముల విశిష్టుడగువాఁడా!

అర్థికల్పక!—(దీనికి మూడువిధములుగ నర్థము చెప్పుదురు.) (1) యాచకులకు కల్పవృక్షముగా నుండువాఁడా! (2) యాచకులను కల్పవృక్షముగా గలవాఁడా! (3) యాచకుడుగను కల్పవృక్షముగను నుండువాఁడా!

అర్థినః కల్పయతీతి అర్థి కల్పకః అనియు సమాసమొనర్పవచ్చునుగాన, అర్థుల జేయువాఁడా యని నాల్గవ యర్థమును పొసగును.

ఆపత్సఖ!—ఆపత్సమయములందు దోడ్పడువాఁడా!

శ్రీమన్నారాయణ!—శ్రీదేవిని వీడి యెడబాయకుండువాఁడా, నారాయణా!

అశరణ్య శరణ్య;—శరణమొండు లేనివారలకు శరణ మైనవాడా!

అనన్య శరణః త్వత్పాదారవిన్దయుగళం శరణమ్ అహం ప్రపద్యే-శరణ మొండెందును లేని నేను నీ శ్రీచరణములబడి శరణుచొచ్చుచున్నాననుట.

**మూ.** (అత్రద్వయమ్) "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతేనారాయణాయనమః" అను ద్వయ మంత్రము నిట నను సంధించుకొనునదనుట. శ్రీమద్రామాను జు లీచోట ద్వయానుసంధానమును దా మొనర్చినదాని నిటనస్మదాదులకును శిక్షించుచున్నారు. నేటికిని నీపట్టు నను సంధించునపుడు ద్వయము నుపాంశువుగ ననుసంధించుట సంప్రదాయము. ద్వయమంత్రపు పూర్వఖండమును న్న వ్యాఖ్యానింపబడినదయ్యెను. ఇకనున్న భాగము చాలవఱకు నుత్తరఖండ వ్యాఖ్యానమైయుండును.

(మూలము.) పితరం మాతరం దారాన్ పుత్రాన్ బన్ధూన్
సఖీన్ గురూన్ । రత్నాని ధనధాన్యాని
క్షేత్రాణిచ గృహాణి చ । సర్వధర్మాంశ్చ
సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్ ।
లోకవిక్రాన్త చరణౌ శరణం తేఽవ్రజంవిభో॥

ఈ రెండును బురాణశ్లోకములు. ఈ శ్లోకముల నిక్కడ నుపా దానముచేయుట యేలనగా బూర్వులు వచించినవాని లోని భావములేగాక వారు వచించిన పలుకులుగూడ బంగా రమునుబోలె గైకొనదగునుగాన బూర్వులువచించినవాని నీ

ప్రకరణమున విన్నవించుకొనుట భగవంతుని హృదయమున ననుగ్రహాతిశయమును గలిగించునని తలంచియే. ఈ శ్లోకములవలన మఱల శరణాగతినొసర్చుచున్నారని తలంపరాదు. * సకృదేవ హి శాస్త్రార్థః * కావున నావృత్తికి బ్రసక్తి లేదు.

విభో! - భగవంతుడా! పితరం మాతరం దారాన్ పుత్రాన్ బన్ధూన్ సఖీన్ గురూన్ - తండ్రిని, తల్లిని, భార్యను, పుత్రులను, బంధువులను, చెలులను, ఆచార్యులను, రత్నాని ధనధాన్యాని క్షేత్రాణి చ గృహాణిచ - రత్నములను ధనధాన్యములను గ్రామభూములను, ఇండ్లను, సర్వధర్మాన్ చ - అన్ని ధర్మములను, సాక్షురాన్ సర్వకామాన్ చ - కైవల్యముతో గూడ సకల కామ్య పురుషార్థములను, (స్వర్గలోకాధిపత్యము బ్రహ్మలోకాధిపత్యము మున్నగువానిలో నాశయుననుట,) సంత్యజ్య - వాసనతో వదలిపెట్టి, తే లోక విక్రాన్త చరణౌ శరణమ్ అవ్రజం - నీ లోకమునుగొలిచిన పదకమలములనే శరణుచొచ్చి యుంటిననుట.

ఇక్కడ దారాన్ పుత్రాన్ బన్ధూన్ సఖీన్ రత్నాని ఇత్యాదులను వదలినట్లు చెప్పుటలో విప్రతిపత్తిలేదు. పితరం మాతరం గురూన్ - అని తలిదండ్రులను గురువులను వదలి పెట్టినట్లు చెప్పుటతగునా? * మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్య దేవోభవ * అని శాస్త్రవిధి వెలసియుండగా నతిలంఘనము చేయుటతగునా? తలిదండ్రులను వదలిపెట్ట వచ్చునని యొకతీఱున నుపపాదించినను నాచార్యత్యాగము నెట్లును నుపపాదింపరాదుకదా, * పశ్చాచ్చార్య పదాశ్రితః * అని ప్రస్తుతింపబడిన శ్రీమద్రామానుజాచార్యులు తామా

చార్యుని వదలిపెట్టినవారుకారే. కాగా, యథార్థమున త్యాజ్యములైన ధనధాన్యాదులతో త్యజింపరాని విషయము లను ద్యజించినట్లనుగ్రహించు నిద్దాని కుపపత్తి యెట్లు? అని కొందఱు సంశయింపవచ్చును. వినుడు, వీరల వదలి పెట్టుట యన విరోధపడి తొలగద్రోయుటకాదు. కావ్యు ధర్మోపయోగిగానో అర్థకామోపయోగిగానో వీరలను గైకొనకుండుటయే త్యాగమగుట. 'గృహాణి చ' యని యింటిని వదలిపెట్టుటగా నిక్కడ చెప్పబడుచున్నది. ఇల్లనగా వాసస్థానము. సన్న్యాసులైనను నొక వాసస్థానములేక యాకాశమున నిలువరాదుకదా, ఒకనివాసస్థానము తప్పక కావలసినదై యవర్జనీయముకాగా దీనిని వదలిపెట్టినట్లు చెప్పుటలోని భావము నరయవలయును. ఈ లోకమున జీవించియుండునంతవఱకు ధనధాన్యములను వదలిపెట్టియుండ నగునా? పరమైకాంతులైన తామే ధనధాన్యాదుల నుంచు కొనకపోయినను దమకు ప్రతినిధులుగా గొంద అంతరంగ శిష్యులనైన నుంచుకొనవలసియుండునే, కానిచో దేహయా త్రను నిర్వహింప మార్గమొండు లేదుకదా. కాన నిక్కడ చెప్పుచున్న త్యాగము సర్వవిధముల త్యాగము కాదనియే కైకొనవలయును. 'దారాన్ బన్ధూన్ సఖీన్' యను నివి మున్నుగా గొన్ని విషయములను సర్వాత్మనా వదలిపెట్టిన గొఱతయేమి? అన్నను, మున్ను వివరించినవిధముగా ద్యజింప వలనుగాని వానిని వదలిపెట్టినట్లుగా జెప్పుటలోని భావ మెఱుంగదగినదే. "కొణ్డపెణ్డిర్ తామ్ ముదలాకూఱుమ్ ముత్తార్" (తిరువాయ్మొழி నూత్తందాది 81) అని మణ

వాళమహామును లనుగ్రహించినట్లు, ఆళ్వారులు * కొణ్డ
పెణ్డిర్ మక్కళుత్తార్ * అను తిరువాయ్మొళిలో చేబట్టిన
భార్యనుకన్నబిడ్డలను వదలిపెట్టునట్లు లుపదేశించి యనుగ్ర
హించినది వాస్తవమే. ఆ యాళ్వారులు తామే దానిక్రింది
పాశురమున * ఆయిరత్తుళ్ళివైయుమ్ పత్తుమ్ వల్లార్కళ్,
నల్లపదత్తాల్ మనైవాళ్వర్ కొణ్డపెణ్డిర్ మక్కళే * యని
యనుగ్రహించుటయు గుర్తింపదగినది. ఒకచోట హేయ
ముగా జెప్పిన కుటుంబజీవితమునే మఱియొకచోట (ఫలశ్రుతి
నిజప్పు ముఖమున) నుపాదేయముగా ననుగ్రహించిరనగా,
త్యాజ్యమగుటకు నిబంధనము వేఱు, ఉపాదేయమగుటకు నిబం
ధనము వేఱు అని తెలిసికొన ప్రాప్తమగును గదా *గురోర
ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః । ఉత్పథం ప్రతిపన్నస్య
సద్యస్త్యాగో విధీయతే *॥ యను మున్నగు శాస్త్రముల
నూతగాగొని యర్థ నిష్కర్ష మొనర్పవలయును. * తన్
గురువిన్ తాళిణైకళ్ తన్నిల్ అన్బన్నిల్లాదార్, అన్బుతన్
పాల్ శెయ్దాలు మమ్బుమైకొన్ - ఇన్బమిగు విణ్ణాడు
తానళిక్క వేణ్డియిరాన్, ఆదలాల్ నణ్ణారవర్కళ్ తిరునాడు*
అనియు * ఞానమనుట్టానమివై నన్నాగవే యుడైయనాన
గురువైయడైన్దక్కాల్ - మానిలత్తీర్ తేనార్ కమలత్తిరు
మామగళ్ కొழுనన్ తానే వైకున్దదరుమ్ * అనియు ననుగ్ర
హించినట్లు ఆచార్యసంబంధమే ముక్తికి ముఖ్యకారణమై
యుండగానట్టి యాచార్యసంబంధమును దొలగించుకొనుటగా
నిట ననుగ్రహించుచున్నారని యర్థము గొన నవకాశము
లేశమైనను లేదు. తలిదండ్రులను నాచార్యులను బుత్ర

మిత్రాదులను భగవద్విభూతులుగా దలచుచున్నాననుటయే యిట బరమ తాత్పర్యము. వీరు భగవద్భాగవతానుభవ విరోధులైనచో వీరలను సర్వాత్మనా త్యజింపను బ్రాప్తమే. ఇంతను విస్తారము గావలెనేని పెద్దలయెడ నాలకించి తెలిసికొనునది.

(మూలము) * త్వమేవ మాతాచ పితాత్వమేవ త్వమేవ బంధుశ్చ గురుస్త్వమేవ । త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవ దేవ ॥

హే దేవదేవ! - రమ్మదేవాధిదేవా ! మాతా చ త్వమేవ, పితాచత్వమేవ - తల్లియునీవే తండ్రియునీవే; బంధుశ్చత్వమేవ, గురుశ్చత్వమేవ, చుట్టమునునీవే ఆచార్యుడునునీవే, విద్యా త్వమేవ, ద్రవిణం త్వమేవ-జ్ఞానమునునీవే, ద్రవ్యమునునీవే. మమ సర్వం త్వమేవ-(వేయేల!) నాకు సర్వమును నీవే. * పెత్తతాయ్ నీయే పిఱప్పిత్త తన్దైనీ, మత్తైయారావారుమ్ నీపేశిల్ * శేలేయ్ కణ్ణియరుమ్ పెరుఙ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలాత్తాయ్తన్దైయుమ్ అవరే యినియావారే * యని యనుగ్రహించుట నిక్కడ ననుసంధించునది. మున్ను పితరం మాతరందారాన్ అను శ్లోకమున వ్యాజించినట్లు చెప్పినవన్నియు భగవంతుడే యని యీ శ్లోకము వలన జెప్పినవారైరి. భగవంతుడు ప్రియప్రవర్తకుడు కావున తల్లిగాను హితప్రవర్తకుడు కావున తండ్రిగాను, మఱియు

సకలవిధ బంధువులును జేయగల యుపకారముల నన్నిటిని చేయుటచేత బంధువుగాను సకలకళలను వేదమును, నీతి శాస్త్రమును కల్పమును పదార్థముల దెలుపుశాస్త్రమును మున్నగువానినెల్ల జక్కగా ననుగ్రహించినందున నాచార్యుడుగను నిట్లన్నివిధముల వెలసినవాడన గొఅతకాదు. తిరుమంగైయాళ్వారులు 'పేయిరుకుర నెడువెళ్లమ్ పెరువిశుమ్బిఙ్' యని యనుగ్రహించుటనుగొని యిచ్చోట వ్యాఖ్యానమున ఆచ్చాఙబిళ్లై యనుగ్రహించిన సరసార్థమును వేదాంతదేశికులును "ప్రళయ దశాయాముదరే స్థాపయిత్వా ప్రసవనాత్ మాతా" యని శ్రీసూక్తిలో గూర్చియుండుట రస్యము. త్వమేవ విద్యా—* నానినుళ్ నిన్నుమలరుమ్ * అను తిరువాయ్మొళిలో జూచునది. 'నోత్తనోన్బిలేఙ్ నుణ్ణఱివిలేఙ్' అని యుండు అకించనులు ఉపాసనారూప విద్యాస్థానమున భగవంతునే యుంతురు గదా. ద్రవిణంత్వమేవ - ఉపాయోపేయములు రెండును నీవేయనుట. లోకమున ద్రవ్యమును కార్యాంతరములకు సాధనముగా గొనుటయు దనకు భోగ్యముగా గొనుటయు బ్రత్యక్షము. అయ్యది భగవంతుని యెడదగును. (7)

(మూలము) *పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాఙ్। నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యోలోకత్రయేప్యప్రతిమప్రభావ! * (8)

అస్యచరాచరస్య లోకస్య త్వం పితా అసి - (ముందుచెప్పిన శ్లోకమున భగవంతుడు తన కొక్కనికే తల్లితండ్రియని జెప్ప

బడినది, ఆ బాంధవ్యము సకలలోక సాధారణము కాన దానినిదెలుపు శ్లోకము నిప్పు డనుసంధించుచున్నారు. (భగవద్గీతలో బదునొకండవ యధ్యాయమున నలువదిమూడవ శ్లోకమియ్యది. దీనితర్వాతి శ్లోకమును నిక్కడజేర్చియే యనుసంధింపబడుచున్నది.) అప్రతిమ ప్రభావ !—సాటిలేని పేర్మినిగలవాడా ! త్వం అస్య చరాచరస్య లోకస్య పితా అసి-నీవు స్థావరజంగమాత్మకమైన యీ లోకమంతటికి తండ్రివైతివి. అస్య లోకస్య పూజ్యః గురుశ్చ అసి - ఈ లోకమునకు బూజ్యుడవగు గురుడవైతివి. కావున నీ లోకమునకెల్ల బూజ్యతముడవై వెలసితివి లోకత్రయేపి త్వత్సమః అన్యః నాస్తి - కారుణ్యాదు లున్నగు గుణములచేత నీకు సాటియగువాడు మూడులోకములందును వేఱొకడు లేడు, అభ్యధికః కుతః సాటియగువాడు లేనప్పుడు మించువాడు లేడని చెప్పవలయునా ? తనతో సాటియగువాడును తన్ను మించినవాడును లేని మాయలాడనుట. ఇక్కడ 'త్వత్సమః నాస్తి' అనక 'త్వత్సమః అన్యః నాస్తి' అనుటచేత నీతో సాటియగువాడు నీవేయనుట " ఉపమానోపమేయత్వం యదేకస్యైవ వస్తునః। ఇన్దురిన్దురివశ్రీమా నిత్యాదౌతదనన్వయః॥ " అందు ఆలంకారికులు. " గగనం గగ నాకారం సాగర స్సాగరోపమః, రామరావణయోర్యుద్ధం రామరావణ యోరివ " ఇత్యాదులు చూచునది 'తన్నొప్పార్ తానా యుళక్కాణ్' అని తిరుమళిశైయాళ్వారులును ననుగ్రహించిరి. (8)

(మూలము) *తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయకాయం ప్రసాదయే త్వా మహమీశమీడ్యమ్। పితేవ

పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియా
యార్హసి దేవ సోఢుమ్ ॥ * (19)

తస్మాత్ - క్రిందిశ్లోకమున జెప్పినట్లు నీవు అన్నింటికన్న బరుడవై యుండుటంబట్టి, అహమ్ - అపరాధములే రూప ముగాగల నేను, ఈశమ్ ఈడ్యం త్వామ్ - సర్వనియంతగను స్తోత్రార్హుడవుగనునుండు నిన్ను, కాయం ప్రణిధాయ ప్రణమ్య - (మొదలు తెగినచెట్టువలె) శరీరమును గ్రిందబడవైచి కొలిచి, ప్రసాదయే - క్షమను వేడుచున్నాను, దేవ - భగవంతుడా! పుత్రస్య (దోషం) పితేవ - కొడుకు తప్పులను దండ్రి యోర్చునట్లును, సఖ్యుః దోషం సఖేవ - మిత్రుని యపరాధములను మిత్రు డోర్చునట్లును, ప్రియాయ (మహ్యాం) ప్రియుడనగు నాకొఱకు, ప్రియః - (త్వమ్) సోఢుమ్ అర్హసి - ప్రియుడవగు నీవు (నా యపరాధములను) సైపదగుదువు: * ప్రియః ప్రియాయార్హసి * యనుచోట ప్రియః ప్రియాయా అర్హసి ' అనియు బదమును విడదీయవచ్చును. అపుడు అర్హసనిగా గొనవలెను. ప్రియురాలి తప్పులను బ్రియుడు సైచునట్లని భావము. (9)

(మూలము) మనోవాక్కాయైరనాదికాల ప్రవృత్తానన్త కృతకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచా రాసహ్యాపచార రూప నానా విధానన్తాపచారాన్ ఆరబ్ధకార్యా ననారబ్ధ కార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్య మాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ. (10)

**మనోవాక్కాయైః** - మనస్సు, వాక్కు, కాయమునను మూటి చేతను, అనాదికాల ప్రవృత్త - మొదలెఱుఁగరాని చాల కాలము మున్నె కలిగిన, అనన్త - లెక్కలేని, అకృత్యకరణ - చేయరాని పనులను జేయుటయు, కృత్యాకరణ - చేయవలసిన కార్యములను జేయక యపచారపడుటయు, భగవదపచార - భగవంతునెడ నపచారపడుటయు, భాగవతాపచార - భగవద్భక్తులయెడ నపచారపడుటయు, అసహ్యాపచారరూప - ఓర్వరానట్టి లపచారముల నొనర్చుటయను నిట్లు, నానావిధానన్తాపచారాన్ - పలువిధములగు నపరిమితములైన తప్పులను, (దీనికి 'అశేషతః క్షమస్వ' అను దానితో నన్వయము.) అశేషతః - ఇసుమంతైన మిగులనట్లు, క్షమస్వ - మన్నించి యనుగ్రహింపవలయును. ఈ యపచారము లెట్టివన్నచో; ఆరబ్ధకార్యాన్ - ఫలమునీయ మొదలిడిన కొన్ని యపచారములు, అనారబ్ధకార్యాన్ - ఇంకను ఫలమునీయ మొదలిడకుండు కొన్ని పాపములు. కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాన్ చ - గతకాలమునను, వర్తమానకాలమునను, భవిష్యత్కాలమునను త్రికాలవ్యాప్తులైయుండు నీ యపచారములు. ఈ యపచారముల నన్నింటిని మన్నించి యనుగ్రహింపవలెననుట.

సర్వాన్ - లోకమున వారు వారొనర్చు నపచారములు మానసికములుగను, వాచికములుగను కాయికములుగను నుండుట ప్రసిద్ధమైయుండగా మనోవాక్కాయైః ప్రవృత్త* యని చెప్పవలయునా యన్నచో; భగవంతుని జింతించుటకై యమరిన మనస్సును,నతని బొగడుటకయియేర్పడినవాక్కును,

నతనికి బలువిధములగుసేవ లొనర్పగలిగిన శరీరమునుగొని అయ్యో!దారితప్పి నడువవలసివచ్చె నే? యని నిర్వేద మిక్కడ దోచును.

ఇట్టి యపచారము లెన్నిదినములుగా జేయబడినవన్న చో, 'అనాదికాల ప్రవృత్త' అనుచున్నారు. సంసారమన్న నో మొదలెఱుగరానిది; * బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున! * యని గీతలో ననుగ్రహింపబడినట్టులే కడచన్న జన్మములకు లెక్కయే లేదు. ఇట్టు లెక్కింపరాని యనాది కాలముతొడగి ప్రవృత్తములైనవి. కాననే యనంతములును నైనవి. వానిని దెగలుగా వేర్పఱిచి చెప్పుచున్నారు. (అకృత్యకరణ) యని మొదలిడి.

అకృత్యకరణమనగా-చేయరానివిగా శాస్త్రములందు జెప్పబడిన దుష్కృత్యములను జేయుట.

* నహింస్యాత్ సర్వా భూతాని * యను విధి నతిక్రమించి ప్రాణులకు గల్గించుపీడ, ప్రాప్త విషయములనుతింప నేర్పడిన వాక్కుచే నప్రాప్త విషయములను గొనియాడుట, పరులద్రవ్యము, దారము మున్నగువాని నపహరించుట, అసత్యమాడుట, తినరానివానిని యథేచ్ఛముగా దినుట-మున్నుగా బలువిధములై యుండునది అకృత్యకరణము.

కృత్యాకరణమనగా - శాస్త్రవిహితములగు వర్ణాశ్రమ ధర్మములను సోమరితనముచేతను, విసుగుదలచేతను నాస్తిక్యముచేతను ననుష్ఠింపక విడుచుట. భగవదపచారమనగా - భగవంతుడగు శ్రీమన్నారాయణుని నితర దేవతలతో సాటిగా దలచుటయు, రామకృష్ణాద్యవతారములందు మనుష్య సజాతీ

యతా బుద్ధి నొసర్చుటయు, సర్వావతారమునందుదాపాన నిరూపణము చేయుట మున్నగునవి. భాగవదపచారమనగ- అహంకారముచేతను, అర్థకామముల నూతగాగొనియు శ్రీ వైష్ణవులకు చేయువిరోధము. అసహ్యాపచారమనగా-ముందు చెప్పినట్లు అర్థకామాది నిబంధనములేకయే హిరణ్యకశిపుని వలె భగవద్విషయము, భాగవతవిషయము ననగా వినను జూడను నోర్వకయుండుట.

ఆచార్యాపచారమును నసహ్యాపచార మనబడును; అనగా - ఆచార్యు డుపదేశించిన యర్థముప్రకార మనుష్ఠింప మియు, నత డుపదేశించిన యర్థముల నల్పప్రయోజనములకై యనధికారుల కుపదేశించుటయు నివి మొదలుగా గలవి. ఆచార్యభక్తులైన సబ్రహ్మచారులతో గలిసి మెలసియుండ వలసియుండ నట్లుగాక వారల నేర్పు పెంపున కసూయవడుట, వారి నగౌరవపఱుచుట మున్నగునవియు నసహ్యాపచారము లనబడును. "భాగవత భక్తవిషయాపచారః అసహ్యాప చారః, ఆచార్యవిషయాపరాధోవా' అని శ్రుతప్రకాశికా చార్యులు ననిరి. ఆ యాచార్యులు భగవదపచారమును' వివరించునప్పు డనుగ్రహించియుండుట రసవత్తరము; భాగ వతాపచారో భగవదపచారః; భగవదపచారో భాగవతా పచారః" యనుట శ్రీవారి శ్రీసూక్తి. భాగవతులయెడల నప చారపడిన నయ్యది భగవదపచారమయియుగియును అనుట. "పాణ్డవాః ద్విషసేరాజః మమప్రాణాహి పాణ్డవాః" అను భగవదుక్తిని * యదపరాధ సహస్రమజస్రజం త్వయిశరణ్యా హిరణ్య ఉపావహత్। వరద తేన చిరం త్వమవిక్రియో వికృతి

మర్త్యక నిర్భజనాదగాః * యను కూరత్తాళ్వానుల శ్రీసూక్తి నిటదలచి చూచునది.

భగవంతు నుద్దేశించియే చెప్పెడి యీ చూర్ణికలో ‘త్వ దపచార’ యని మధ్యమపురుషమున చేర్కొనవలసి యుండ ‘భగవదపచార’ యని ప్రథమపురుషమున ననుగ్రహించియుండుట పొసగునా యని సందియ మేర్పడవచ్చును. అయినను గొఱతలేదు; భగవదపచారమనియే ప్రసిద్ధి ప్రాచుర్యముండుటచేత నిట్లనుగ్రహింపబడినది. * త్వదపచారేతి వక్తవ్యేపి అత్ర భగవదపచారశబ్దః తత్తత్ప్రమాణోపాత్త ప్రకారసూచనార్థః * యని వేదాంతదేశికులు ననిరి.

ఈ వాక్యమున అనన్తపదము రెండుమాఱులు ప్రయోగింపబడియున్నది. మొదటనున్న యనన్తపదము అకృత్యకరణ కృత్యాకరణ రూపసామాన్యాపచారములలో నన్వయించును. రెండవ అనన్తపదము భగవదపచారాదులలో నన్వయించును.

*(ఆరబ్ధకార్యాన్ ఆనారబ్ధకార్యాన్) ప్రారబ్ధకర్మములనియు సంచిత కర్మములనియు కర్మములను[illegible]తెఱంగులు; మనముచేయు కర్మములన్నియు వెనువెంటనే ఫలమునీయ మొదలిడవు; పరిపాకక్రమముననే ఫలమునిచ్చును. అట్లు ఫలమునీయ దొడంగిన కర్మములు ప్రారబ్ధము లనబడును. వానినే యిక్కడ “ఆరబ్ధకార్యాన్” అని పేర్కొనుట. అట్టి ప్రారబ్ధ కర్మములచే నిరుద్ధావసరములై అనుపక్రాంత ఫలములైయున్న కర్మములే సంచితము లనబడును. వానినే యిక్కడ ‘అనారబ్ధ కార్యాన్’ అని పేర్కొనుట.

(మూలము) అనాదికాల ప్రవృత్తం విపరీతజ్ఞాన మాత్మ
విషయం కృత్స్న జగద్విషయంచ విపరీతవృత్తం
చ అశేషవిషయమ్ అద్యాపివర్తమానం
వర్తిష్యమాణం చ సర్వం క్షమస్వ ॥ ౧౧

ఇక మోక్షవిరోధియగు పుణ్యపాపరూపములైన త్యాజ్యములైన బంధములను క్షమించి యనుగ్రహింపవలెనని వేడుచున్నారు. అనాదికాల ప్రవృత్తం - మొదలెఱుగరాని కాలమునుండి కలదై, ఆత్మవిషయం కృత్స్నజగద్విషయం చ విపరీతజ్ఞానం- ఆత్మనుగుఱించినదియు, సమస్తజగమునుబట్టియున్నదైన విపరీతజ్ఞానమును (క్షమించి యనుగ్రహింపవలయును); అశేష విషయమ్ - అన్నింటిని బట్టికొనియున్నదై, అద్యాపివర్తమానం- ఇంకను ననువర్తించుచున్నదై వర్తిష్యమాణంచ - ఇకమీద నుపాసనా బలము చేతగలుగనున్నదై, సర్వంచ విపరీతవృత్తం- క్షమస్వ - అన్నివిధములైన నిషిద్ధానుష్ఠానములను మన్నించి యనుగ్రహింపవలెను. ఆత్మవిషయమైన విపరీతజ్ఞానమనగా దేహాత్మాభిమానము, స్వతంత్రాత్మభ్రమము, అన్యశేషత్వ భ్రమము మున్నగునవి. కృత్స్నజగద్విషయమైన విపరీత జ్ఞాన మనగా - * సర్వభూతాత్మకే! తాత! జగన్నాథే జగన్మయే, పరమాత్మని గోవిన్దే మిత్రామిత్ర గతాకుతః ? * అను ప్రహ్లాదునివలెగాక దేవతిర్యఙ్మనుష్యాది పదార్థములను నట్లట్లే భావించుట. 'ఆత్మవిషయం' 'కృత్స్న జగద్విషయం అను విశేషణములు 'విపరీత వృత్త' అను విశేష్య మందును నన్వయించును. ఆత్మవిషయమైన విపరీత వృత్త మనగా స్వరక్షణేస్వాన్వయము మున్నగునవి. జగద్విషయ

మైన విపరీత వృత్తమనగా - తనకొక డొక కీడు చేసినచో నది స్వకర్మఫలమనియో కృపాఫలమనియో తలపక నిమిత్తమాత్రమగు చేతనుని స్వతంత్రునిగా దలంచి యతడు గీడొనర్చినాడని వానియెడ నొకటికిబదిగా గీడొనర్చుట. విశేషవిషయం-ఐశ్వర్యము మున్నగు పురుషార్థములను గోరుట మున్నగు కామ్యముల వివక్షించుచున్నది. మున్నొనర్చినవాని నిపుడొనర్చుచున్నవానిని నిక జేయనున్నవాని నన్నింటిని నజ్ఞానినగు నే నెఱుంగనుగాని సర్వజ్ఞులరగు దేవర తెలిసికొని మన్నించి యనుగ్రహింపవలెనని చెప్పినవారైరి.

(మూలము) మదీయానాది కర్మప్రవాహ ప్రవృత్తాం భగవత్స్వరూపతిరోధానకరీం విపరీత జ్ఞాన జననీం స్వవిషయాయాశ్చ భోగ్యబుద్ధేర్జననీం దేహేన్ద్రియత్వేన భోగ్యత్వేన సూక్ష్మ రూపేణ చావస్థితాం దైవీం గుణమయీం మాయాం దాస భూతం "శరణాగతోస్మి తవాస్మి దాస" ఇతివక్తారం మాం తారయ ॥

(౧౨)

ఈ చూర్ణికలో దాసభూతమ్ అని ద్వితీయాంతముగా జెప్పవలసినదానిని 'దాసభూతః' యని ప్రథమాంతముగా కొందఱు పాఠ మొనర్చుచు వచ్చుటకలదు. దాసభూతం అని ద్వితీయాంతపాఠముగా గొనుటయేతగును. పూర్వుల కభిమతమైన పాఠము నిదియే. దాసభూతుడును, శరణాగతోస్మి తవాస్మి దాసయని చెప్పువాడునునగుదన్ను అని యర్థముగా గొనునది.

క్రింద జెప్పిన అజ్ఞానమునకు మూలమైన దేహసంబం

ధమును దొలగింపవలెనని యీ చూర్ణికవలన ప్రార్థించు
చున్నారు. గీతలో శ్రీకృష్ణుడు * దైవీహ్యేషా గుణమయీ
మమ మాయా దురత్యయా ॥ మామేవయే ప్రపద్యన్తే
మాయామేతాం తరన్తి తే * (7-14) అని చెప్పెను గదా.
దానిని మదిదలంచియే యిట 'మాంతారయ' యనిరి.
మాయ యనగా ప్రకృతి; దానిని నేను గడచునట్లనుగ్ర
హింపవలె ననుచున్నారు.

మదీయ అనాదికర్మ ప్రవాహ ప్రవృత్తాం - చాల దిన
ములుగ నే నొనర్చిన కర్మపరంపరచే గలిగినదై, భగవత్స్వ
రూప తిరోధానకరీం - భగవంతుడవగు నీ నిజమైన స్వరూ
పము నెఱుంగనీయక యడ్డగించునదియునై, విపరీతజ్ఞానజననీం-
దేహాత్మభ్రమముమున్నగు విపరీత జ్ఞానమును గలిగించునదై,
స్వవిషయాయాః భోగ్యబుద్ధేశ్చ జననీం-స్వకార్యభూతమైన
శబ్దాదులందు భోగ్యతాబుద్ధిని గలిగించునదై, దేహేన్ద్రియ
త్వేన భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చ అవస్థితాం-భోగాయ
తనమైన దేహరూపముచేతను భోగోపకరణమైన యింద్రియ
రూపముచేతను భోగ్యమైన శబ్దాది రూపముచేతను నన్నింటి
కిని నాదిమూలమైన సూక్ష్మప్రకృతి రూపముచేతను (కాగా
నిట్లు నాలుగుతెఱంగుల పరిణామమును గలిగినదై, దైవీం -
ఇంపు పుట్టించునీ క్రీడలనుగలవాడు కావున దేవుడను పేర
వెలసిన నీచేత గ్రీడాపరికరముగ జేయబడినదై, గుణమయీం-
సత్వ రజస్తమోగుణమూర్తియై, మాయాం - విచిత్రకార్య
మొనర్చునదగుటం జేసి మాయ యను పేరబరగునదైన
ప్రకృతిని, (దీనికి మాంతారయ యనుదానితో నన్వయము).

మాం అను విశేష్యవ్యక్తికి రెండు విశేషణముల నిడు చున్నారు, 'దాసభూతం' అనియు, 'శరణాగతోస్మి తవాస్మి దాస యితి వక్తారం' అనియు, దాసభూతమ్ - దాసుడుగను, శరణాగతోస్మితవాస్మిదాస యితి వక్తారం - ద్వయమున బూర్వఖండము ననుసరించి శరణాగతుడనైతిని, ఉత్తరఖండ ము ననుసరించి కైంకర్యనిరతుడనయితినని వాతెఱచి పలుకు చున్నవాడనగు, మాం - నన్ను, తారయ - (ప్రకృతిని) గడచినవాడగు నట్లనుగ్రహింపవలయును. (మాయాం మాం తారయేతి ద్వికర్మకప్రయోగః) తవాస్మిదాసః అనుచోటగల అస్మి ప్రార్థనాభిప్రాయముతో బ్రయోగింపబడినదని గైకొన వలెను. దాసవృత్తి పరుడనైయుండగలవాడననుట, ఇట్లు గొననప్పుడు ముందు 'దాసభూతం' అని చెప్పినదానినే మఱల చెప్పినట్లగును. అని వేదాంత దేశికులు తలంచుచున్నారు.

ఇక చతుర్థియొక్క యర్థమగు నిష్టప్రాప్తిని బ్రార్థించు చున్నారు.

(మూలము) తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే। ప్రియోహి జ్ఞానినో త్యర్థమహం స చ మమ ప్రియః ॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వా త్మైవమే మతమ్ ॥ ఆస్థితస్సహియుక్తాత్మా మామేవా నుత్తమాంగతిమ్ ॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే। వాసు దేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః ॥ * ఇతి శ్లోక త్రయోదిత జ్ఞానినం మాం కురుష్వ * ॥ (౧౩)

సమశ్ఛబ్దముయొక్క యర్థమగు విరోధి నివర్తనమును ముందు ప్రార్థించిరి; అంతతో నిలువవచ్చునా? పరమపురుషార్థమగు కైంకర్యసిద్ధియు కావలయునుగదా. ఆ కైంకర్యమును బ్రార్థింపదలచి యందులకు నతిముఖ్యమైనవై, కైంకర్యమును బోలె బ్రియవిషయమై శ్రీ వైకుంఠమునందును ననువర్తించున వైన పరభక్తి, పరజ్ఞాన పరమభక్తుల నపేక్షించి భక్తిరూపాపన్నమైనజ్ఞానముకలవారలకే యవి సిద్ధింపగలవుకాన నా జ్ఞానము సిద్ధింపవలయునని, గీతాచార్యు లనుగ్రహించిన మూడు శ్లోకములను ముంచిడుకొని - ఆ జ్ఞానమును గలిగించి యనుగ్రహింపవలయునని ప్రార్థించుచున్నారు. భగవద్గీతలో నేడవయధ్యాయమున పదునేడు, పదునెనిమిది, పందొమ్మిదవ శ్లోకముల నర్థ యనుసంధించి యీ మూడుశ్లోకములందును జేర్కొనబడిన జ్ఞానమునుగలవానిగా దాసునిజేసి యనుగ్రహింపవలెనని వేడుకొనుచున్నారు.

ఈ మూడు శ్లోకములకును భావము వివరింపబడుచున్నది. క్రిందటి శ్లోకమున "చతుర్విధా భజన్తే మాం" అని తొడగి, తన్ను భజించువారలు నలుతెఱంగులుగ నుందురని శ్రీకృష్ణుడు వచించినవా డయ్యెను. భ్రష్టైశ్వర్యకాముడు, అపూర్వైశ్వర్యకాముడు, ఆత్మానుభవమగు కైవల్యమోక్షమును గోరువాడు, భగవదనుభవమను పరమపురుషార్థమును గోరువాడునననునల్వురుగా జెప్పబడినను నైశ్వర్యకాములని యొక తెగవారేకాన ముగ్గురుగానే గ్రహింపనచ్చును. అట్లు ముత్తెఱంగుల వారలగు భక్తులలో జ్ఞానియనువాడు శ్రేష్ఠ

డనుట. (తేషాం జ్ఞానీ......విశిష్యతే) అని. ఆ గొప్పదన మునకు గారణ మేమన, (నిత్యయుక్తః, ఏకభక్తిః) నిత్య యుక్తుడై, ఏకభక్తియై యుండుటంబట్టి జ్ఞానిశ్రేష్ఠుడయ్యెను. జ్ఞానినః అత్యర్థంప్రియః అహమ్ - జ్ఞానికి నాయెడగల ప్రీతి వాచామగోచరమనుట, సచ మమప్రియః-అట్లే ఆజ్ఞానియెడ నాకుగల ప్రీతియు వాచామగోచరమనుట, ఏతే సర్వే ఏవ ఉదారాః - క్రిందజెప్పిన యధికారు లెల్లరు నన్నే యుపా సించుటచే నౌదార్యము మిక్కుటముగా గలవారు. నాయెడ నుండి యిసుమంతైన గొనువారల నేను నాకు సర్వస్వదాత లుగా దలచువాడననుట, జ్ఞానీతు ఆత్మైవ మేమతం— అయినను జ్ఞానినే నేను నాకు బ్రాణముగా దలచువాడ ననుట, ఏలన; సహి యుక్తాత్మా మామేవ అనుత్తమాం గతిమ్ ఆస్థితః—నాతో గలిసియే మన నెంచిన యీ యధి కారియగువాడు నన్నే శ్రేష్ఠమైన ప్రాప్యవస్తువుగా దలచియుం డుటంబట్టి యనుట, (పైన * బహూనాం జన్మనామ్ అన్తే- పలుపుట్టుకలు గడచినవెనుక, జ్ఞానవాన్ - నాకు శేషమై యుండుటయే ఆత్మస్వరూపమని తెలిసినవాడై, మాం ప్రపద్యతే - జ్ఞానియగువాడు నన్నుగొలుచును; ఎట్లు గొలుచుచున్నాడన్నచో; వాసుదేవస్సర్వమ్ ఇతి - కొనెడి యన్నము త్రావెడి నీరెల్లయు కృష్ణుడే యను ప్రతిపత్తితో గొలుచుచున్నాడు. స, మహాత్మా సుదుర్లభః - యట్టి మహా త్ముడు నాకు దొరకుట దుర్లభము. కాగా నీ మూడు శ్లోక ములందును బొగడబడిన జ్ఞానిగా దాసు నొనర్చి యనుగ్రహిం పవలయునని ప్రార్థించినవారైరి. (13)

(మూలము) * పురుషస్సపరః పార్థ! భక్త్యాలభ్య స్త్వనన్యయా। * భక్త్యా త్వనన్యయా శక్యః * మద్భక్తిం లభతేపరామ్* ఇతిస్థాన త్రయోదితపర భక్తియుక్తం మాం కురుష్వ ॥ (14)

పురుష స్సపరః పార్థ! అను శ్లోకము గీతలో నెనిమిదవ యధ్యాయమున నిరువది రెండవది. భక్త్యాత్వనన్యయాశక్యః* అనుశ్లోకము పదునొకండవ యధ్యాయమున నేబదినాల్గవది. * మద్భక్తిం లభతే పరాం * అనునది పదునెనిమిదవ యధ్యాయమున నేబదినాల్గవది. కాగా నీమూడు చోటుల లోను జెప్పబడిన పరభక్తి యడియేనికి గలుగజేసి యనుగ్రహింపవలెనని ప్రార్థించినవారైరి. (14)

(మూలము) పరభక్తి పరజ్ఞాన పరమభక్త్యైక స్వభావం మాం కురుష్వ ॥ (15)

పరభక్తి కలిగినంత బర్యాప్తము కాదుకదా. పరభక్తి, పరజ్ఞానము, పరమభక్తి యివియే రూపుగొన్నవానినిగా నొనర్చి నన్ననుగ్రహింపవలెననుచున్నారు.

(మూలము) పరభక్తి పరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణానవరత నిత్యవిశదతమానన్య ప్రయోజనానవధికాతిశయప్రియ భగవదనుభవోఽహం తథావిధ భగవదనుభవ జనితానవధికాతిశయ ప్రీతికారితా శేషావస్థోచితా శేష శేషతైక రతిరూప నిత్యకింకరో భవాని ॥ (16)

ఈ చూర్ణికచేత నిత్యానుభవమును నిత్యకైంకర్యమునుబొంది జీవించువాడగావలయునని ప్రార్థించినవారైరి. క్రిందటి

రెండవచూర్ణికలోని వాక్య సన్నివేశమే యిక్కడ నించుక మాఱుపడి యున్నదింతయే. వివరణమక్కడ గని తెలియునది.

(మూలము) ఏవంభూత మత్కైంకర్య ప్రాప్త్యుపాయ
తయా అవక్లృప్త సమస్తవస్తువిహీనోపి,
అనన్త మదపచార యుక్తోపి, అనన్త మదీ
యాపచారయుక్తోపి, అనన్తాసహ్యాపచార
యుక్తోపి, ఏతత్కార్య కారణభూతానాది
విపరీతాహఙ్కార విమూఢాత్మ స్వభావోపి,
ఏతదుభయ కార్యకారణ భూతానాది విపరీత
వాసనా సంబద్ధోపి, ఏతదనుగుణ ప్రకృతి
విశేష సంబద్ధోపి, ఏతన్మూలాధ్యాత్మిక ఆధి
భౌతిక ఆధిదైవిక సుఖదుఃఖ తద్ధేతు తదితరో
పేక్షణీయ విషయానుభవజ్ఞాన సంకోచరూప
మచ్చరణారవిన్దయుగళై కాన్తికాత్యన్తిక పర
భక్తి పరజ్ఞాన పరమభక్తి విఘ్నప్రతిహతోపి,
యేనకేనాపి ప్రకారేణ ద్వయవక్తా త్వం
కేవలం మదీయయైవదయయా నిశ్శేషవినష్ట
సహేతుక మచ్చరణారవిన్దయుగళై కాన్తి
కాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి
విఘ్నః మత్ప్రసాదలబ్ధ మచ్చరణారవిన్దయుగ
ళై కాన్తికాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమ
భక్తిః మత్ప్రసాదాదేవ సాక్షాత్కృత యథా
వస్థిత మత్స్వరూప రూపగుణ విభూతి లీలో
పకరణ విస్తారః, అపరోక్షసిద్ధ మన్నియా

మ్యతా మద్దాస్యైక స్వభావాత్మ స్వరూపః, మదేకానుభవః, మద్దాస్యైకప్రియః, పరిపూర్ణానవరతనిత్య విశదతమానన్య ప్రయోజనానవధికాతి శయప్రియ మదనుభవ స్త్వంతథావిధ మదనుభవ జనితా నవధికాతిశయప్రీతి కారితా శేషావస్థో చితా శేష శేషతైక రతి రూప నిత్య కింకరోభవ ॥ (1)

ఇక నిదిమొదలుగ నీ గద్యము ముగియుదనుక భగవంతుని ప్రతివచన ప్రకారము ననుసరించువిధము......ఏవంభూత మత్కైంకర్యప్రాప్త్యుపాయతయా అవక్లుప్త సమస్త వస్తు విహీనోపి - (ఈ చూర్ణిక నడుమ "త్వం కేవలం మదీయ యైవ దయయా" యను చోటగల 'త్వం' అనునది ముందు యోజించుకొనదగును. శ్రీరామానుజులజూచి శ్రీరంగనాథులు ప్రతివచించుట యగు నిది. క్రిందటి చూర్ణికలో 'నిత్య కింకరో భవాని' యని ప్రార్థించినందులకు—అట్లే నిత్యకింకరులు గండని యనుగ్రహించుట యీ చూర్ణికలో గానవగును. 'ఏవంభూత' యనునది కైంకర్యమునకు విశేషణము. క్రిందజెప్పిన చూర్ణికలో నెట్టికైంకర్యము కోరబడినదో యట్టిదిట ననువదించుట. మీరు కోరినట్లే కైంకర్యమును బొందుట కెట్టెట్టి యుపాయానుష్ఠానములు శాస్త్రములందు విధింపబడియున్నవో యవి యొక్కటేనియు మీకు లేకున్నను ననుట.

అనన్త తద్విరోధిపాప ఆక్రాన్తోపి - అట్టి యుపాయానుష్ఠానముల నికపై సంపాదించుకొనరానట్టులు వానికి విరో

ధములగు నపరిమితపాపము లెక్కువగా గలిగియుంటిరై
నను, అనన్త మదపచారయుక్తోపి - నాయెడ నొనర్చిన యప
చారము లపరిమితములుగా గలిగియుంటిరైనను, అనన్త మదీ
యాపచార యుక్తోపి - అపరిమితములయిన భాగవతాపచార
ముల నిండుగా గలిగియుంటిరేనైనను, అనన్త అసహ్యాపచార
యుక్తోపి - అపరిమితములైన యసహ్యాపచారములు మెండు
కొనియుండు వారలైతిరేనైనను, ఏతత్ కార్య కారణభూత
అనాది విపరీతాహంకార విమూఢాత్మ స్వభావోపి - ఇట్టి
యపచారములవలన గలుగునదియు వీనినింకను బెంపొందించు
నవియునగు ననాది విపరీతాహంకారములచే మఱు గొనర్ప
బడిన యాత్మస్వభావముకలవారలైతిరేనియును, ఏ తదుభయ
కార్యకారణభూత అనాది విపరీతవాసనా సంబద్ధోపి - క్రింద
జెప్పబడిన యపచారమును నహంకారమునునగు రెండింటికిని
కార్యమును కారణమునునైన యనాది విపరీతవాసనచే జుట్ట
బడియున్నవారలే యైతిరేనియును, ఏతనుగుణ ప్రకృతి విశేష
సంబద్ధోపి - క్రిందజెప్పిన యపచారాహంకార వాసనలగు
మూటికిని దగిన రాజసతామస ప్రకృతిలో జక్కగా గట్టువడి
యున్నవారలైతిరేనియును, ఏతన్మూల 'ఆధ్యాత్మిక ఆధి
భౌతిక ఆధిదైవిక సుఖదుఃఖ తద్ధేతు తదితర ఉపేక్షణీయ విష
యానుభవజ్ఞాన సంకోచరూప మచ్చరణారవిన్దయుగళై
కాన్తిక ఆత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి విఘ్నప్రతి
హతోపి-క్రిందజెప్పిన ప్రకృతి మూలముగానివచ్చు తాపత్రయ
మనబడు సుఖదుఃఖము లేమి వానికి హేతువైనవేమి యా
సుఖదుఃఖములకన్నను వేఱై యుపేక్షింపదగిన విషయము

లేమి వీని యనుభవమును జ్ఞానసంకోచమునగు నా శ్రీచరణ యుగళము నాశ్రయించిన పరిపూర్ణ పరభక్తి పరజ్ఞాన పరమ భక్తి యనునవి విఘ్నములవలన గీడ్పడియున్నవిగాగలవార లై తిరేనియును, యేనకేనాపి ప్రకారేణ ద్వయవక్తా త్వం- ఏదేని నొకవిధమున ద్వయమును జెప్పినవారల రగు మీరు, కేవలం మదీయయైవదయయా - నా నిర్హేతుక కృపచేతనే, నిశ్శేష వినష్ట సహేతుక మచ్చరణారవిన్దయుగళై కాన్తికాత్య న్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి విఘ్నః - నా శ్రీచరణ నళినములబట్టిన పరభక్తి పరజ్ఞాన పరమభక్తుల విఘ్నములెల్ల నిర్మూలములై, (వానికారణములతో) జక్కగా దొలగిపోయి నవిగా గలవారలై, మత్ప్రసాదలబ్ధ మచ్చరణారవిన్దయుగళై కాన్తిక ఆత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తిః-నా శ్రీచరణ ములబట్టిన పరభక్తి పరజ్ఞాన పరమభక్తుల నా యనుగ్రహ కారణమున గలిగినవారలై, మత్ ప్రసాదాత్ ఏవ - నా యనుగ్రహమును నిమిత్తముగా గలిగియే, సాక్షాత్కృత యథావస్థిత మత్ స్వరూపరూప గుణవిభూతి లీలోపకరణ విస్తారః - నా స్వరూపము రూపము కల్యాణగుణములు నిత్య విభూతి లీలావిభూతియను వీని విస్తారముల నున్నదున్నట్లు సాక్షాత్కరింపబడినవారలై, అపరోక్షసిద్ధ మన్నియామ్యతా మద్దాస్యైక స్వభావాత్మస్వరూపః-నాకే నియామ్యమును నాకే లోబడినదై యుండుట స్వభావముగాగల యాత్మస్వరూ పమును గ్రహించినవారలై, మదేకానుభవః - నన్నొకనినే యనుభవింపగోరినవారలై, మద్దాస్యైకప్రియః - నా కైంక ర్యము చేయుటయందే ప్రీతికలవారలై, పరిపూర్ణానవరత నిత్య

విశతతమ అనన్య ప్రయోజన అనవధికాతిశయప్రియ మదను భవ స్త్వమ్ :—పరిపూర్ణమైనదియు, నెడలేనిదియు, నెప్పుడును విశదమైనదియు, ప్రయోజనాంతరములం దాసక్తిలేనిదియు, పరమప్రియమైనదియునైయుండు నా యనుభవమును గలవారలై, తథావిధ మదనుభవజనిత అనవధికాతిశయ ప్రీతి కారిత అశేషావస్థోచిత అశేష శేషతైక రతిరూప నిత్య కింకరోభవ - అట్టి నా యనుభవముచేత గలిగింపబడిన మిక్కిలి ప్రీతితో నొప్పిన సర్వావస్థోచిత సకల కైంకర్యములందును నాశ కలిగియుండు దాసులుగ నగుదురుగాక, (అని యనుగ్రహించుచున్నారు.)

ఈ చూర్ణికలోని పరమతాత్పర్య మేదనగా - నాకు నిత్యకైంకర్యమునొనర్చి సంతసింపవలయునను నాశ కలిగిన మీరు దానికి తగిన యొక యుపాయమందును దవిలియుండనివారలై యుంటిరేమైనను, ఆ ఉపాయ మికనైనను గలుగకుండునట్లుగా నొనర్చు విరోధులగు పాపసంఘములతో గూడినవారలైతిరేమైనను, భగవదపచార భాగవతాపచార అసహ్యాపచారములు మిక్కుటముగా గలిగియున్నవారలైతిరైనను, పరభక్తి పరజ్ఞాన పరమభక్తులు కలుగకుండుటకు గారణములైన యడ్డులు పెక్కులుగలవార లైతిరేనియును, మీరు ఆర్తప్రపన్నులరో, దృప్తపన్నులరోయై ద్వయమంత్రమునను సంధించితిరి కాన నా నిర్హేతుక కృపవలననే యడ్డులన్నియు దీరినవారలై పరభక్తి పరజ్ఞాన పరమభక్తులు పుష్కలముగాగలవారలై నా స్వరూపరూపగుణ విభూతులను సాక్షాత్కారముగలవారలై యీ స్వరూపమును జక్కగా

దెలిసినవారలై నన్నే యనుభవించువారలరై నాకే సేవ లొనర్చువారలరై మనువారలగుదురుగాక యని భగవంతు డనుగ్రహించిన విధమును వివరించినవారలైరి. (17)

(మూలము) ఏవం భూతోఽసి. (18)

ఇయ్యదియు భగవంతు డనుగ్రహించినదే మున్నునే జెప్పినట్టు లు గాదొడంగితిరనుట, "ఏవం భవితు ముపక్రాన్తోఽసీత్యర్థః" అనునది దేశికభాష్య సూక్తి. (18)

(మూలము) ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక దుఃఖవిఘ్న
గన్ధరహితస్త్వం ద్వయమర్థానుసంధానేన
సహ సదైవం వక్తా యావచ్ఛరీరపాత
మత్రైవ శ్రీరంగే సుఖమాస్వ. (19)

* ఆత్తంగరై వాళ్ మరమ్ పోలఞ్జికిన్నేన్ * అనియు, * ఇరుపాడెరి కొళ్ళియినుళ్ళెఱుమ్బే పోలురుకానిఱ్కు-మెన్నుళ్ళమ్ " అనియు, * వెళ్ళత్తిడైప్పట్ట నరియినమ్పోలే ఉళ్ళమ్ తుళఙ్గానిఱ్పన్ * అనియు వెలువవలసినట్టులుగ నున్న యీ యంధకార బంధురమగు భూలోకమున నిరపాయముగా గాల క్షేపముచేయ మార్గమేది? అను సందేహమునకు బరిహార ముగా నీ చూర్ణికను భగవంతు డనుగ్రహించుచున్నాడనుట.

తాపత్రయజనిత దుఃఖమైన యాటంకములు నుంతయు లేనివారలై ద్వయమంత్రము నర్థానుసంధానముతోఁగూడ నెల్లప్పుడు నిట్లే చెప్పుచుండువారలై యీ శరీరము ముగియు దనుక నీ శ్రీరంగక్షేత్రమున వెలసియుందురుగాక యని భగవా ను డనుగ్రహించుచున్నారు. ఇక్కడ శ్రీరంగమును జెప్పుట దా

మెచ్చిన దివ్యక్షేత్రము లన్నింటికిని నుపలక్షణమని వేదాంత దేశికులు తలంచిరి. (19)

(మూలము) శరీరపాత సమయేతు కేవలం మదీయయైవ దయయా అతిప్రబుద్ధో మామేవావ లోకయన్ అప్రచ్యుత పూర్వసంస్కార మనోరథః జీర్ణమివ వస్త్రం సుఖేనేమాం ప్రకృతిం స్థూలసూక్ష్మరూపాం విసృజ్య, తదానీమేవ మత్ప్రసాదలబ్ధ మచ్చరణారవిన్ద యుగళై కాన్తి కాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి పరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణానవరత నిత్య విశదతమానన్య ప్రయోజనానవధికాతి శయ ప్రియమదనుభవ స్త్వంతథావిధ జనితాన వధికాతిశయ ప్రీతికారితా శేషావస్థో చితా శేష శేషతైక రతిరూప నిత్యకింకరో భవిష్యసి ॥ (20)

ప్రపన్నునకు బూర్వ కృత్యమనియు నుత్తర కృత్యమనియు నిరుతెఱంగులున్నవి. పూర్వకృత్యము నింతకుమున్నె వివరించినవారైరి. ఇక ఉత్తరకృత్యమును బేర్కొనుచున్నారు. ఈ శరీరము పతనమును బొందుస్థితి యెట్టిది? పరమఫలము చేతబడున దెప్పుడు? అను ప్రశ్నములకు సమాధానము లిందు వచింపబడుచున్నవి. ఇదియును భగవంతు డనుగ్రహించిన వాక్కు ననువదించుటయే. శరీరపాతసమయేతు - శరీరము పతనము బొందు నపుడు, కేవలం మదీయయైవ దయయా అతి ప్రబుద్ధః - కేవలము నా స్వభావమగుదయచేతనే మిక్కిలి శ్రేష్ఠమైన జ్ఞానముకలవారలై, మాం ఏవ అవలోకయన్ -

ఇతః పూర్వము చింతింపబడిన నన్నే యెల్లప్పుడును దలంచు వారలరై, అప్రచ్యుత పూర్వసంస్కార మనోరథః - "భగవంతుడే నాకు బరమప్రాప్య భూతుడు" అను సంస్కారమును బ్రాప్తిలో గలిగిన పట్టుదలయు దగ్గనివారలరై, స్థూలసూక్ష్మ రూపాం ఇమాం ప్రకృతిం జీర్ణం వస్త్రమివ సుఖేన విసృజ్య - స్థూలమును సూక్ష్మమునగు నీ ప్రకృతిని బ్రాతవస్త్రమును వదలిపెట్టినట్లుగా సులభముగా వీడి, తదానీమ్ ఏవ - అప్పుడే (ఆలస్యము లేక) మత్ప్రసాదలబ్ధ మచ్చరణారవిన్దయుగళై కాన్తికాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణానవరత నిత్యవిశదతమానన్య ప్రయోజనా నవధితకాతిశయ ప్రియ మదనుభవ జనితా నవధికాతియ ప్రీతి కారిత అశేషావస్థోచితా, శేష శేషతైకరతిరూప నిత్యకింకరః భవిష్యసి-నా యనుగ్రహముచేతనే........నిత్యకైంకర్య సామ్రాజ్యమును బొందినవారలు కానున్నారలు. మున్ను "పారమార్థిక భగవచ్చరణారవిన్ద"యను రెండవ చూర్ణికలో ననుగ్రహించిన శ్రీసూక్తులే యిక్కడను గలవగుటంబట్టి విరివియగు వ్యాఖ్య నచట చూచునది.

(మూలము) మా తే భూ దత్ర సంశయః ॥ (21)

"నిత్య కింకరో భవిష్యసి" యని యనుగ్రహించిన యీ విషయమున మీకు సంశయ మక్కఱ లేదనుట.

* ప్రసక్తస్యైవ హిప్రతిషేధః * యనికదా న్యాయము కలదు; ఇక్కడ సందియమునకు బ్రసక్తి యున్నదా యన్నచో; లోకమున క్షుద్రఫలములను బొందుటకు గొప్ప యుపాయానుష్ఠానములను జూచుచునేయున్నాము; మిక్కిలి

గొప్పదగు మోక్ష పురుషార్థమును బడయుటకు-దుష్కరత్వమున నిక దీనికి సాటిలేదన దగినట్లు పరమదుష్కరమైన యుపాయ ముండ వలదా? మిక్కిలి సుకరమైన యీ న్యాసమాత్రమున నా ఫలము తప్పదన్నచో, నిది కన్నీళ్ల దుడుచు మాటలుగా నుండునో యని కొందఱకు సందియము దోప వచ్చును గాన వారలకును దెలివిడియగునట్లుగ శ్రీమద్రామానుజుల నపదేశించి * మా తే భూదత్ర సంశయః * అని తన దివ్య వదనమును విప్పి యనుగ్రహించుచున్నారు. (21)

(మూలము) *అనృతం నోక్త పూర్వం మే నచవక్ష్యే కదా చన * రామో ద్విర్నాభిభాషతే * సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే । అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ * సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ । అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥* ఇతి మయైవ హ్యుక్తమ్ ॥ (22)

* మా తే భూదత్ర సంశయః * అని మున్ననుగ్రహించిన దానినే చక్కగా నెలకొల్ప నీ చూర్ణికయు పై చూర్ణికయు నవతరించినవి. నా నిత్యకైంకర్య ప్రాప్తిలో మీకు సందేహము వర్తించునేని నేను ముందే వచించియున్న పలుకులకు విరోధ మేర్పడునే; అవి యసత్యములగునే. "తేశుడైయ దేవర్ తిరువరంగచ్చెల్వనార్" అని మీ చెల్లెలును బల్కియున్నదే: కాన నా మాటల నుపచ్ఛందనమాత్రముగ గ్రహింపవలదని భగవంతు డనుగ్రహించుచున్నారు.

ఇందనుక నే నొకప్పుడును నసత్యమాడినది లేదు ; ఇక జెప్పఁబోవునదియు లేదని కృష్ణావతారమున జెప్పబడినది, శ్రీరామునినోట రెండు మాటలు రావని రామావ తారమున జెప్పితిని; మఱియు, రామావతారమున సముద్రపు గట్టున విభీషణుల వ్యాజమున * సకృదేవ ప్రపన్నాయ * అని చరమశ్లోకమును వచించితిని; కృష్ణావతారమున తేరిపై నర్జునుని వ్యాజీకరించి * సర్వధర్మాన్ పరిత్యజ్య * యను చరమశ్లోకమును జెప్పితిని ; * సకృదేవ * యను శ్లోకమున * ఏతత్ వ్రతం మమ * అనునది కండపట్టయిన మాట. * సర్వ ధర్మాన్ * అను శ్లోకమున * మాశుచ * అనునది కండపట్టయిన మాట. కాగా నిట్లు చెప్పియున్న నేను నేఁడు అసత్య మాడనని నిశ్చయముగలుగ బలుకుటకయ్యె.

(మూలము) అతస్త్వం తవతత్త్వతో మత్ జ్ఞానదర్శన
ప్రాప్తిషు నిస్సంశయ స్సుఖమాస్వ ॥ 22

ముందుచెప్పినదానినే దృఢపఱచి యనుగ్రహించుట సంతో షాతిశయమునుగూర్పనే. ఇదియు భగవద్వాక్యము. అతః - సత్యవాదియు సత్యవ్రతుడనునగు నేనుచెప్పిన వాక్యములు మిక్కిలి విశ్వసింపదగినవికావున, త్వమ్ - ప్రామాణికులరగు మీరు, తవ-నాచే స్వీకరింపబడిన సకల భరములనుగల మీయొక్క, తత్త్వతః మత్ జ్ఞానదర్శన ప్రాప్తిషు - ఉన్నట్టు లుగా నన్ను దెలిసికొనుట, చూచుట, నిత్యకైంకర్యమును జేయుట యను వీనిలో, నిస్సంశయః - శంకాకళంక లేశ మును లేనివారలై, సుఖమాస్వ-సుఖముగనుందురుగాక యని శ్రీమద్రామానుజులనుజూచి భగవాను లనుగ్రహించిరి.

24. ఇకపై * అంత్యకాలే స్మృతిర్యాతు తవ కైంకర్యకారితా, తామేనాం భగవన్నద్య క్రియమాణాం కురుష్వమే ॥ * అని యొక శ్లోక మనుసంధింపబడుచున్నది. కాని పెరియవాచ్చాన్ పిళ్లైవారో శ్రుతప్రకాశికాచార్యులో వేదాంతదేశికులో దీనికి వ్యాఖ్యానము చేయరైరి.

శ్రీమద్రామానుజాచార్యు లనుగ్రహించిన
గద్యత్రయమున శరణాగతి గద్యము
ముగిసెను.

శ్రీ కాంచీ ప్రతివాది భయంకరమ్
అణ్ణంగరాచార్యులు విరచించిన
గద్యభావ ప్రకాశికలో
ప్రథమగద్యము ముగిసెను.

శ్రీ

# శరణాగతి గద్య తాత్పర్యసారము

ఈ గద్యమునగల చూర్ణికలు 24. వీనికి బ్రతిపదార్థములును విశేషార్థములును వ్రాయబడియున్నవైనను సారమైన తాత్పర్యమును గథవలె మనస్సులో నాటుకొన నీ తాత్పర్య సార ముల్లేఖింపబడుచున్నది.

చూర్ణిక 1, మీాద * అఖిలహేయ ప్రత్యనీ కేత్యాదులైన మొదవ చూర్ణికలో స్వామి తా మనుసంధింపబోవు

చున్న భగవచ్ఛరణాగతి చక్కగా నెఱవేరుటకై మున్నున్న శ్రీ దేవియెడ బురుషకార ప్రపత్తి నొనర్చిరి.

2. శ్రీ దేవినిగూర్చి చేసిన పురుషకారప్రపత్తి యిద్దానికని యింకు వ్యక్తముగా జెప్పబడినది.

3, 4. అస్తుతేఅంగుననే యగుగాక యని శ్రీదేవి యనుగ్రహ మొనరించునదిద్దాన గూర్పబడినది.

5. భగవంతుని దివ్యాత్మస్వరూప దివ్యమంగళ విగ్రహముల వైలక్షణ్యమును, గల్యాణ గుణయోగమును, దివ్యభూషణ విశిష్టతను, దివ్యాయుధములను, దివ్యమహిషీ సాహిత్యమును, నిత్యసూరులతోడి చేరికయు, నిత్యవిభూతినాయకత్వమును, లీలావిభూతి నిర్వాహకత్వమును మఱియు సత్యకామత్వ సత్యసంకల్పత్వాది గుణవిశేషముల గలిగియుండుటను వివరించిచెప్పి భగవంతుని చరణములందు శరణాగతి నొనర్చుటను జెప్పిరి.

6, 7, 8, 9. ద్వయానుసంధానము నొనర్చి; పురాణ శ్లోకములు రెండింటిని గీతలోని మూడు శ్లోకములనునను సంధించిరి.

10, 11. కాలత్రయమందును గరణత్రయముచేతను గలుగు సమస్తాపచారములను మన్నించి యనుగ్రహింపవలయునని ప్రార్థించిరి. 10 లో నిషిద్ధాచరణ క్షమాప్రార్థన; 11 లో కామ్యాచరణ క్షమాప్రార్థన.

12. గీతలో *మమ మాయా దురత్యయా* అనియు * మామేవయే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే * అని

యను జెప్పియున్నదాని ననుసరించి మాయను దొలగింపవలె నని ప్రార్థించిరి.

13. గీతలోని మూడుశ్లోకములను జేరొక్కనివాన జెప్పిన జ్ఞానముగలుగవలయునని ప్రార్థించిరి.

14. గీతలో మూడుచోటులలో జేరొక్కన్న పరభక్తి తమకు గలుగవలెనని ప్రార్థించిరి.

15. పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులే రూపుగొన్న వానినిగా నడియేనినొనర్చి యనుగ్రహింపవలెనని ప్రార్థించిరి.

16. ఆ పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులచేత విలక్షణ భగవదనుభవముకలిగి యా యనుభవ పరీవాహ రూపముగా నిత్యకైంకర్య రుచి కలుగవలె ననిరి.

17. (ఇక పై గద్యము తుదివఱకు భగవంతుని ప్రతి వచనము)

17. రండీ, రామానుజులవారూ ! నాకు నిత్యకైంకర్య మొనర్చి సంతసింపగోరిన మీరు దానికయి యొక యుపాయ మందును నన్వయము లేకున్నను, నా యుపాయము లికపై నిష్పన్నము కాగూడనట్టులు విరోధులైన పాపములు నిండుగ గలిగియున్నవారలైతిరేమైనను, సకల విధాపచారములను నిండుగ గలిగినవారలైతిరేనియును, పరభక్తి పరజ్ఞాన పరమ భక్తులు గలుగకుండ హేతువులగు నడ్డులు పెక్కు గలిగియుంటి రేనియును, మీరు ఆర్త ప్రపన్నులరయియో దృప్తప్రపన్ను లరయియో ద్వయ మంత్రమును ననుసంధించితిరి గానవా నిర్హేతుక కృపచేతనే విఘ్నములన్నియు దొలగగా పరభక్తి పరజ్ఞాన పరమభక్తులను బుష్కలముగా బొంది నా స్వరూప

రూపగుణ విభూతులను సాక్షాత్కరింపబొంది మీ స్వరూప మును జక్కగా తెలిసికొన్నవారలై నన్నే యనుభవించు వారలై నాకే సేవచేయువారలై మనగలరని భగవంతు లను గ్రహించిన విధమును జెప్పిరి.

18. ఇటులే కాజొచ్చితిరని భగవంతు లనుగ్రహిం చుటను జెప్పిరి.

19. తాపత్రయము లేశమునులేక యర్థానుసంధానము తో ద్వయోచ్చారణము చేసికొని యీ శరీరము పతన మొందుదనుక నీ శ్రీరంగమున నింపున వసింపుడని యనుగ్ర హించుటం జెప్పిరి.

20. ఈ శరీరము పతనమొందునపుడు గొప్పమేల్లను బడసి నిత్యకైంకర్య నిరతులు కాగలరని యనుగ్రహించున దిద్దాన బేర్కొనిరి.

21. ఇందుసుంతైన సందియముపడవలదని తెలియజెప్పిన దిద్దాన గూర్చిరి.

22. తనవారుకు పొల్లుకానేరదని భగవంతు లిద్దాన ద.

23, మున్దొనర్చిన యభయప్రదానమును దృఢపఱుప నిగమించిరి. (కాగా నింతయు భగవంతుని ప్రతివచనము.)

24. అన్తిమస్మృతి వలయునని తలంతురేని * అప్పో దైక్కిప్పోదే శొల్లివై త్తేన్ * అనునట్టులుగైకొని యనుగ్రహిం పవలెనని శ్రీమద్రామానుజులు ప్రార్థించుచు దమ గద్యమును నిగమించిరి.

శరణాగతిగద్య తాత్పర్యసారము ముగిసెను.

శ్రీ

ఎమ్పెరుమానార్ తిరువడిగళే శరణమ్.

గద్యత్రయమున రెండవగద్యము

# శ్రీరంగ గద్యము

తనియన్

చిదచిత్పర తత్త్వానాం తత్త్వయాథార్థ్యవేదినే ।
రామానుజాయ మునయే నమో మమగరీయసే ॥

చిత్ అచిత్ పరతత్త్వానాం - చేతనుడు అచేతనము ఈశ్వరు డను మూడుతత్త్వములయొక్క, తత్త్వ యాథార్థ్య వేదినే - ఉన్నదున్నట్లులు తెలిసినవారలైన, మమగరీయసే - నాకుత్తమ గురువులైన, రామానుజాయమునయే - మునివరులగు రామానుజులకు, నమః - నమస్కృతు లగుగాక.

ఈ రెండవ గద్యమునకు శ్రీరంగగద్యమను వ్యవహారమును మితగద్యమను వ్యవహారమును గలదు. ఇక్కడ మొదటిచూర్ణికలో "శ్రీరంగశాయినమ్" అని యనుగ్రహించిన దానింగొనియు, తుదిని "శ్రీరంగనాథ! మమనాథ! నమోస్తుతే" యని యనుగ్రహించిన దానింగొనియు శ్రీరంగ గద్యమని వ్యవహరింపబడినదని గ్రహింపవలెను. తొలి గద్యము పెద్ద దగుటంబట్టి దానిని పెరియగద్యమనియు బృహద్గద్యమనియు, నియ్యది చిన్నదగుటంబట్టి దీనిని శిఱియగద్యమనియు మిత గద్యమనియు పెద్దలనిరి.

తొలిగద్యమున విరివిగా ననుగ్రహింపబడిన విషయమే దీనిలో సంగ్రహముగా ననుగ్రహింపబడెను. తొలిగద్యమును

ద్వయవివరణమే యగును. సంక్షేప విస్తరములవలననే భేదము. ఇందు తొలిచూర్ణిక కైంకర్య ప్రార్థనాపరమైన యుత్తరఖండ వివరణముగను, రెండవచూర్ణిక శరణావరణ ప్రదర్శనపరమైన పూర్వఖండముయొక్క వివరణముగను నవతరించెను.

అవతారిక ముగిసెను.

(మూలము) స్వాధీన త్రివిధచేత నాచేతన స్వరూపస్థితి
ప్రవృత్తిభేదం క్లేశకర్మాద్యశేష దోషాసం
స్పృష్టం స్వాభావికా నవధికాతి శయ జ్ఞాన
బలైశ్వర్య వీర్యశక్తి తేజ స్సౌశీల్యవాత్సల్య
మార్దవార్జవ సౌహార్ద సామ్యకారుణ్య మాధు
ర్య గాంభీర్యౌదార్య చాతుర్యస్థైర్య ధైర్య
శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప
కృతిత్వ కృతజ్ఞతాద్యసంఖ్యేయ కల్యాణ
గుణగణౌఘ మహార్ణవం పరబ్రహ్మభూతం
పురుషోత్తమం శ్రీరంగశాయినమ్ అస్మత్స్వా
మినం ప్రబుద్ధ నిత్యనియామ్య నిత్యదాస్యై
కరసాత్మ స్వభావోహం తదేకాను భవ స్త
దేకప్రియః పరిపూర్ణం భగవన్తం విశదతమా
ను భవేన నిరన్తరమనుభూయ తదనుభవజని
తానవధికాతిశయప్రీతి కారి తాశేషావస్థో
చి తాశేష శేషతైక రతిరూప నిత్యకింకరో
భవాని ॥ (1)

ముక్తబద్ధములైన చేతనాచేతనాచేతనముల స్వరూపమేమి రక్షణమేమి ప్రవృత్తి నివృత్తులేమి వీనిని దన యధీనముగా గలిగియున్న. (ఇది మొదలైన ద్వితీయాంత విశేషణము లన్నియు మీాద 'భగవన్తమ'ను విశేష్యమున నన్వయించి 'విశదతమానుభవేన నిరన్తరమనుభూయ' యని పొందుపడ దగును.) తిరువాయ్‌మొళిలో "ఉయర్‌వఱ వుయర్‌నల" మను ప్రథమ దశకమున * నామవనివనువర్ * అవరవర్ తమ తమదు * నిన్ఱనరిరున్దనర్ * అనియున్న మూాడు పాశురముల ననుసరించి యీా తొలి విశేషణ మనుగ్రహింప బడినది. * నామవనివర్ " అను పాశురమున చేతనాచేతన ముల స్వరూపములు భగవంతు నధీనములనుట. * అవరవర్ తమ తమదు* అను పాశురమున వానిరక్షణమును భగవంతునక ధీనమనుట. * నిన్ఱనరిరున్దనర్ * అను పాశురమున వారి ప్రవృత్తి నివృత్తులును భగవంతు నధీనములనుట. చేతనులు భక్తు లనియు నిత్యులనియు ముక్తరంగుల నుండుటంబట్టి "త్రి విధచేతన " యనబడియె. అచేతనము త్రిగుణమనియు, కాల మనియు, శుద్ధసత్త్వమనియు ముక్తబంగులగుటంబట్టి 'త్రివిధ అచేతన' యనబడియె. 'త్రివిధ' యనువిశేషణము చేతన మాత్రమున నన్వయించి యచేతనమున నన్వయింపకయునుండ వచ్చునని వేదాంతదేశికులు తలంచుచున్నారు. చూర్ణికలో గడపటనున్న భేదపదము స్వరూపము మున్నుగాగల మూాటి లోను నన్వయించి స్వరూపభేదము స్థితిభేదము ప్రవృత్తిభేదము నని గ్రహించున దొప్పును. ఒక్కొక్క-దానిలోను నవాంతర భేదములు పెక్కు- లేర్పడుట గ్రహించునది.

క్లేశకర్మాద్యశేషదోష అసంస్పృష్టం - అవిద్యమున్నగు నైదు క్లేశములును, పుణ్యాపాపరూపమైన కర్మమును నివి మున్నగ నెట్టి దోషసంబంధమును లేని; చేత నాచేతనములు శరీరమునై భగవంతుడు శరీరి యయియుండు నేని శరీర సంబంధముచే గలుగు దోషము శరీరికిని రాదో యన్నచో, రాదని చెప్పున దీ విశేషణము. క్లేశములనునవి - అవిద్య, అస్మిత, అభినివేశము, రాగము, ద్వేషమునని యైదుగా జెప్పబడినవి. వాని కార్యములయిన పుణ్యాపాపములు కర్మము లగును. ఆది పదముచే విపాకము మున్నగునవి గ్రహించునది.

స్వాభావిక అనవధికాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్య శక్తి తేజస్ సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సామ్య కారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వకృతజ్ఞ తాద్యసంఖ్యేయ కల్యాణగుణ గణౌఘ మహార్ణవం - స్వాభావికములై నిరతిశయానన్త్యమును గలదై యున్న షాడ్గుణ్యము మున్నగు కల్యాణగుణములకు కడలింబోలిన (క్రింద శరణాగతి గద్యమున నీచూర్ణికయే కూర్పబడి యున్నది. వ్యాఖ్యానము నటచూచునది.)

పరబ్రహ్మభూతం పురుషోత్తమం - పరబ్రహ్మ శబ్దము చేతను పురుషోత్తమ శబ్దము చేతను వేదాంతములలో ప్రసిద్ధుడైన, శ్రీరంగశాయినం - శ్రీరంగమునం దస్మ దాదులును గన్నులారగాంచ గలిగినట్లు వెలసియున్న, అస్మత్స్వామినం పరిపూర్ణం భగవన్తం - మాకు స్వామియై

యెందును కొఱలేకయున్న భగవంతుని 'దీనికి అను భూయ' అనువ్యాప్తితో నన్వయము) ప్రబుద్ధ నిత్యనియామ్య నిత్య దాస్యైక రస ఆత్మ స్వభావః అహం - నిత్య నియామ్యమై నిత్యదాస్యైకరసమైన ఆత్మస్వభావమును జక్కగా దెలిసికొన్న వాడనగు నేను, ప్రబుద్ధ అనునది - చక్కగా దెలిసిన యనుట. నిత్య నియామ్యమై యుండుటయు నిత్య దాస్యైక రసమై యుండుటయు నను స్వభావము చక్కగా దెలిసికొన బడియెనని చెప్పిన వారైరి. స్వాధీన స్వార్థ కర్తృత్వ భోక్తృత్వ భ్రమము లేక తెలిసికొన బడునదే చక్కగా దెలిసికొన బడుటయగును. ఈయాత్మ భగవంతుడొకనికే నియామ్యుడును దాసుడునగునని చక్కగాదెలిసికొన్న నేనని చెప్పినవారైరి.

తదేకానుభవః తదేకప్రియః-భగవద్విషయ మొక్కటే జ్ఞానమునకును భక్తికిని విషయముగా బొందినవాడనై, విశదతమానుభవేన నిరంతరమనుభూయ-మిక్కిలివిశదముగా నెడలేక యనుభవించి, తదనుభవజనిత అనవధికాతిశయ ప్రీతి కారిత అశేషావస్థోచిత అశేష శేషతైక రతిరూప నిత్యకింకరః భవాని - ఆ యనుభవముచే గలిగింపబడిన మిక్కిలి ప్రీతిచే జేయబడిన సర్వావస్థోచిత సర్వ విధ కైంకర్యములందును బట్టుదలతో గూడియుండుట యను నిత్యకైంకర్య నిరతుడనై యుండగలను.

శేషతైకరతిః అనునది బహువ్రీహియై నిత్యకింకరునకు విశేషణమగును. అశేషమైన దాస్యమునను జక్కగ దవిలిన నిత్యకింకరుడను గాగలవాడననుట. కాగానింతకుద్వయమునందుపేయమునుగూర్చిన యుత్తరఖండము వివరింపబడినదయ్యెను.

ఇక ఉపాయమును గూర్చిన పూర్వఖండమును వివరింప జొచ్చి, అందుత్తమపురుషునిలో వివక్షితమైన ఆకించన్యమను ప్రపత్తి యధికారవిశేషమును కార్పణ్యమను అంగమును స్వాత్మ నిత్యనియామ్యయని మొదలిడి వివరించుచున్నారీ రెండవ చూర్ణికచేత.

(మూలము) 2. స్వాత్మ నిత్యనియామ్య నిత్య దాస్యైక రస ఆత్మ స్వభావాను సన్ధానపూర్వక భగ వదనవధికాతిశయ స్వామ్యాద్యఖిల గుణగ ణానుభవజనిత అనవధికాతిశయ ప్రీతికారిత అశేషావస్థోచిత అశేష శేషతైక రతిరూప నిత్యకైంకర్య ప్రాప్త్యుపాయ (భూత) భక్తి తదుపాయ సమ్యక్జ్ఞాన తదుపాయ సమీ చీనక్రియా తదనుగుణ సాత్త్విక తాస్తిక్యాది సమస్తాత్మగుణ విహీనః దురుత్తరానన్త తద్వి పర్యయ జ్ఞానక్రియా గుణానాది పాపవాసనా మహార్ణవాన్తర్నిమగ్నః తిలతైలవద్దారు వహ్నివ ద్దుర్వివేచ త్రిగుణక్షణ క్షరణస్వభా వాచేతన ప్రకృతి వ్యాప్తిరూప దురత్యయ భగవన్మాయాతిరోహిత స్వప్రకాశః అనా ద్యవిద్యా సఞ్చితానన్తా శక్యవిస్రంసన కర్మ పాశ ప్రగ్రథిత అనాగతానన్తకాల సమీ క్షయాఽప్యదృష్టసన్తారోపాయః, నిఖిలజన్తు జాతశరణ్య! శ్రీమన్! నారాయణ! తవచర ణారవిన్ద యుగళం శరణమహం ప్రపద్యే.

స్వాత్మ నిత్య నియామ్య- దాసుడనెల్లప్పుడును నియమింప దగినవాడనై యుండుట యేమి, నిత్యదాస్య- ఎల్లప్పుడును దాస్యముచేయుచు నుండుట యేమి, ఏకరస-యను వీనినే సారముగాకల, ఆత్మస్వభావ అనుసన్ధాన పూర్వక- స్వస్వభావము ననుసంధించి దానివలన గలిగిన, భగవత్ అనవధికాతిశయ స్వామ్యాది అఖిల గుణగణానుభవ జనిత - ఎల్లప్పుడును దీనికే నియమింపదగువాడై యుండుట యేమి, నిత్య కైంకర్యము నందే పట్టుదల కలిగి యుండుటేమి యను నిట్టి స్వ స్వభావము ననుసంధించు కొని, భగవంతుని స్వామిత్వము మున్నగు సకల శ్రేష్ఠగుణ గణముల ననుభవించుటచే కలిగిన, ప్రీతి కారిత - మిక్కిలి ప్రీతిచే చేయింపబడిన, అశేషావ స్థోచిత అశేష శేషతైక రతిరూప నిత్యకైంకర్య ప్రాప్త్యు పాయభ క్తి-సర్వావస్థోచిత సర్వవిధ కైంకర్యములందును ప్రావణ్యము కలిగి యుండుట యగు నిత్యకైంకర్యమునకు ఉపాయమైన భక్తి యేమి, తదుపాయ సమ్యక్ జ్ఞాన - దానికుపాయమైన పరిపక్వ జ్ఞాన మేమి, తదుపాయ సమీచీన క్రియా - దానికుపాయ మైన మంచి కర్మయోగ మేమి, త దనుగుణ సాత్త్వికతా ఆస్తిక్యాది సమస్త ఆత్మగుణ విహీనః-దానికంగమైన సాత్వి కత్వము ఆస్తిక్యము మున్నగు నాత్మ గుణము లేమి యగునివి కొంచెమును లేని వాడనై, దురుద్ధరానన్త తద్విపర్యయ జ్ఞాన క్రియానుగుణ అనాది పాపవాసనా మహార్ణవాన్తర్ని మగ్నః- ముందు చెప్పిన సమ్యగ్జ్ఞాన సమీచీన క్రియలకు

నెదురైన విపరీతజ్ఞాన విపరీత క్రియలకు సంగమైన యనాది పాపవాసనయగు గడవరానిమహాసముద్రములో మునిగి యుండువాడనై, తిలతైలవత్ దారు వహ్నివత్ దుర్వివేచ త్రిగుణ క్షణక్షరణ స్వభావ అచేతన ప్రకృతివ్యాప్తిరూప దురత్యయ భగవన్మాయా తిరోహిత స్వప్రకాశః - నువ్వులలో నూనె వలెను, కట్టెలలో నిప్పువలెను సాధారణముగా నెడపఱుప నలనుగానిదై సత్వరజ స్తమస్సులను, సతతపరిణామిత్వమును స్వభావముగా గలిగినదై జడ రూపమైన ప్రకృతిలో నవర్జనీయమైయున్న సంబంధమును గలదై దాట వీలుగానిదైన భగవన్మాయచే దాపబడిన స్వప్రకాశమును గలవాడనై అనాద్య విద్యాసంచిత అనన్త అశక్య విస్రంసన కర్మపాశ ప్రగ్రథితః - అనాదియైన అజ్ఞానముచే సంచితమై లెక్కింపనలవికానిదై యెవరికిని వదలింపరానిదై యున్న, పుణ్యాపాపరూపకర్మమను త్రాటిచే గట్టబడినవాడనై, అనాగత అనన్తకాల సమీక్షయాపి అదృష్ట సంతారోపాయః అహం - ఎంతకాలముచూచినను నిస్తరణోపాయమియ్యదని తెలియనివాడనైయున్న నేను, నిఖిలజన్తు జాతశరణ్యా! - సమస్తప్రాణి సమూహములకును శరణ్యుడవగువాడా! శ్రీమన్నారాయణ - శ్రీదేవితో గూడియున్ననారాయణుడా! - తవ చరణారవిన్ద యుగళం శరణంప్రపద్యే - నీ శ్రీచరణ నళినముల నుపాయముగా జేపట్టుచున్నాడను. (౨)

(మూలము) ఏవమవస్థితస్యాపి అర్థిత్వమాత్రేణ పరమ
కారుణికోభగవాన్ స్వానుభవ ప్రీత్యోపనీత

ఐకాన్తి కాత్యన్తిక నిత్యకైంకర్యైకరతిరూప
నిత్యదాస్యం దాస్యతీతి విశ్వాసపూర్వకం
భగవన్తం నిత్యకింకరతాం ప్రార్థయే. (3)

ఏవమ్ అవస్థితస్యాపి - క్రిందటి చూర్ణికలో వివరింపబడినట్లు ఆకించన్యాదులే రూపుగొన్న నాకును, పరమకారుణికః భగవాన్ - పరమకారుణికుడగు భగవంతుడు, అర్థిత్వమాత్రేణ- నాయెడగల యర్థిత్వము నేయూతగాగొని. స్వానుభవ ప్రీత్యా ఉపనీత ఐకాన్తికాత్యన్తిక నిత్యకైంకర్యైకరతిరూప నిత్య దాస్యం దాస్యతి ఇతి విశ్వాసపూర్వకం - తన్ననుభవించు ప్రీతిచేగలుగునదై ముగింపులేకయుండునదై దాస్యమందే తవిలియుండుటయగు నిత్యకైంర్యము నను గ్రహింపగలడను నమ్మికతో, భగవన్తం నిత్యకింకరతాం ప్రార్థయే-భగవంతునెడ నిత్యకైంకర్యమును ప్రార్థించుచున్నాను. (3)

(మూలము) * తవానుభూతి సంభూత ప్రీతికారిత దాస
తాం, దేహి మే కృపయానాథ! నజానే గతి
మన్యథా. (౪)
సర్వావస్థోచితాశేష శేషతైక రతిస్తవ। భవే
యం పుణ్డరీకాక్ష త్వమేవైవంకురుష్వమాం*

మున్ను తనపాశురమునఁ బ్రార్థించిన వానినే యిప్పుడు ఇతిహాసశ్లోకములు రెంటినిగొని ప్రార్థించుచున్నారు. ఈరెండు శ్లోకములకును నితిహాస పురాణములలో నాకరము కను గొనునది.

భగవంతుడా! నిన్ననుభవించి దానివలన గలుగు ప్రీతి వలనగలుగు కైంకర్యమును బరమకృపతో నడియేని కను గ్రహింపవలయును. వేఱు శరణ మెందును గాననైతిని. కెందమ్మింబోలిన కన్నులుగలవాడా! సర్వావస్థలందును నీకు చేయదగు సకలవిధ కైంకర్యములందును నడియేని రుచిగలిగిన వాడనుగా జేసి యనుగ్రహింప వలసినవాడవు నీవకాదే యనునదీ రెండుశ్లోకములలోని భావము. (౧, ౨)

(మూలము) ఏవంభూతతత్త్వ యాథాత్మ్యావబోధ తది
చ్ఛారహితస్యాపి ఏతదుచ్చారణ మాత్రా
వలంబనేన ఉచ్యమానార్థ పరమార్థ నిష్ఠం మే
మనస్ త్వమేవ అద్యైవకారయ. (౬)

శ్రీ రంగనాథుడా! నీ యనుగ్రహముచే నడియేని నధికార పూర్తి పొందిన వాడనైతినని తలంచెదను; ఒకవేళ యట్టి యధికార పూర్తి లేదేని నడియేని యొహ గలుగు ఉక్తి వ్యాజమును గొని నీవే శేషపూరణమును జేసికొనవలెనని ప్రార్థించున దీ చూర్ణికలోని భావము.

ఏవంభూత తత్త్వ యాథాత్మ్యావబోధ తదిచ్ఛార హితస్యాపి - ఇట్టి మిక్కిలి శ్రేష్ఠమైన పురుషార్థము యొక్క సత్య స్థితిని దెలిసికొనునదియు నట్టి తెలిసికొన గోరునదియు నను కోరికలు లేనివాడనే నైతినేనియును, ఏత దుచ్చారణ మాత్ర అవలంబనేన - నా నోటి మాటలనే యూతగా గొని, మేమనః - నా హృదయమును, ఉచ్య మానార్థ పరమార్థ నిష్ఠమ్ - ఉపాయోపేయముల సత్యమును దెలిసినదిగా,

త్వంఏవ అద్య ఏవకారయ - నీవయిప్పుడే చేసి యనుగ్రహింప వలెను.

కురు, అనక కారయ అనునదిదియు సతని దయయే యను పరమార్థమును దెలుపుచున్నది. (౬)

(మూలము) అపార కరుణామ్బుధే ! అనాలోచిత విశేషా శేషలోకశరణ్య ! ప్రణతార్తిహార ! ఆశ్రిత వాత్సల్యైక మహోదధే ! అనవరత విదిత నిఖిల భూతజాతయాథాత్మ్య ! సత్యకామ ! సత్యసఙ్కల్ప ! ఆపత్సఖ ! కాకుత్స్థ ! శ్రీమన్ ! నారాయణ ! పురుషోత్తమ! శ్రీరఙ్గనాథ! మమనాథ! నమోఽస్తుతే ॥౭॥

7. అపార కరుణాంబుధే ! పారములేని కరుణాసముద్రమగువాడా! అనాలోచిత విశేష అశేష లోకశరణ్య ! - గుణదోష నిరూపణముచేయక సకల జగములకును శరణ్యుడవగువాడా ! ప్రణత ఆర్తిహార!-నమ్రులగువారల యార్తిని దొలగించువాడా! ఆశ్రితవాత్సల్య ఏక జలధే! -దాసులయెడగలిగిన వాత్సల్యమునకు మహాసముద్రమైన వాడా! అనవరత విదిత నిఖిలభూత జాతయాథాత్మ్య! - సకలభూత సమూహాములయు సత్యము నెల్లప్పుడును దెలిసియున్నవాడా ! సత్యకామ! - అవాప్త సమస్తకాముడా! సత్యసంకల్ప! - తా దలచినదానిని నెఱవేర్పగలిగిన వాడా! ఆపత్సఖ! - ఆపద్బంధువగువాడా!, కాకుత్స్థ! - కకుత్స్థ వంశమున జన్మించిన వాడా ! శ్రీమన్నారాయణ! - శ్రీమన్నారాయణుడా !

శ్రీరంగనాథ! - శ్రీరంగనాథుడా, మమనాథ! - నాకునాథు డవగువాడా! - తేనమః అస్తు= దేవరకే శేషమైన యీఆత్మ వస్తువు దేవరకే భోగ్యమగుగాక యనుట..................*

శ్రీరంగ గద్యమను మితగద్యము ముగిసినది.

ఎమ్బెరుమానార్ తిరువడిగళేశరణమ్

శ్రీకాంచీ అణ్ణంగరాచార్యులు రచించిన

గద్యభావప్రకాశికలో శ్రీరంగగద్య వ్యాఖ్యానము ముగిసెను.

శ్రీ

ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణమ్.

గద్యత్రయమున మూడవ గద్యము

# శ్రీవైకుంఠ గద్యమ్

అవతారిక.

శ్రీమద్రామానుజులు తమహృదయమునజక్కగా నాటి యున్నయర్థము తాటినీడంబలె దనతో నిలువక కల్పవృక్షంబు నీడంబలె లోకమునకెల్ల బ్రయోజనముం జేకూర్చునది కావలయునని తలంచి యనుగ్రహించిన వారలుకాన ఊరును నాడును లోకమును దమవలెనగునట్లు లుపాయోపేయముల నిష్కర్షించి యనుగ్రహించి పరోపకారమున దవిలినవారలై రి- ఈ వైకుంఠగద్యముఖమున. బృహద్గద్యమగు శరణాగతి గద్యములో శ్రీమన్నారాయణునిగూర్చి స్వప్రార్థనగా సనుగ్ర

హించిరి. మిత గద్యమగు శ్రీరంగ గద్యములో, నా ప్రార్థనను సౌలభ్యమునకు దలపొలమై వెలసిన భగవంతుని విషయముగా ననుగ్రహించిరి. ఇందు పరత్వమునకు దలపొలమై వెలసిన శ్రీ వైకుంఠనాథునివిషయముగా బరులజూచి కర్తవ్యోపదేశ మొనర్చుటగా ననుగ్రహించిరి. ఇందు నుపాయమగు నంశ మును సంగ్రహించి యుపేయమగు నంశమును విపులీకరించి యనుగ్రహించుచున్నారు. ఈగద్యమున నాలుచూర్ణికలున్నవి. వీని తాత్పర్యసారము.—

చూర్ణిక 1. భగవంతుని స్వరూప రూపగుణ విభూతి వైలక్షణ్యమును దనస్థితిని ననుసంధించి యా భగవంతుని సౌశీల్యాది కల్యాణగుణములే యూతగాగొని యతని శ్రీచరణ ములందు శరణుచొరవలయు ననుట.

2. పరమార్థమును బడయ నొకపరి యనుసంధించునదే చాలినదై యుండినను డెంద మన్యవిషయములందు దవులకుండ నుండను, కాలక్షేపమునకునునై నిత్యానుసన్ధాన మొనర్ప వలయుననుట.

3. ఈయధికారి అర్చిరాది మార్గమునజని ప్రకృతిమండ లమును గడచువిధమును నట్లు గడచి చొచ్చు నిత్యవిభూతి యొక్క వైభవమును నా దేశ విశేషముయొక్క పేర్మియు నక్కడి యలంకారములును నట్టిచోట శ్రీదేవియు సర్వేశ్వ రుడును వెలసియుండుతీరును నా శ్రీదేవి కనుభావ్యమైయున్న దివ్య సౌందర్యమును, దివ్యాభరణముల చేరికయును, దివ్యా యుధవర్గమును, పారపొచ్చెములులేక సేవచేయు నిత్యసూరి పరిషత్తును, వారి నిత్య కైంకర్యమునకు లక్ష్యమై వెలసియుం

డు నునికియు ననుసంధించి యిట్టిప్రాప్యమును మనమెప్పుడు పొందగలమో యని పలువిధముల దమకించి భగవంతునిసవిూపించి "స్వామీ! నాచే నిత్యకైంకర్యమునుగొని న న్ననుగ్రహింపవలయున"ని ప్రార్థించి యాత్మసమర్పణ మొనర్చు ననుట.

4. స్వాపేక్షితము ననుసరించి భగవంతునిచే స్వీకరింపబడినవాడై యనుకూలవృత్తి నొనరించు చుండు ననుట.

5. ఈ పురుషార్థమును జాలకాలము పీడియుండిన దోసగుతీఱ జెప్పవేయక సదా యతనిని దర్శనముచేయుచుండు న దిందు జెప్పబడినది.

6. ఇట్లువచ్చి చేరిన వీనిని భగవంతుడు కటాక్షించి తన చరణ నళినముల నతని దలపై నిడ నట్టి మహాభాగ్యము నంది నిత్యానంద శాలియై యుండున దిందు జెప్పబడినది.

శ్రీ వైకుంఠ గద్య తాత్పర్యసారము ముగిసెను.

---

(మూలము) యాము నార్య సుధామ్భోధి మవగాహ్య
యథా మతి। ఆదాయ భక్తి యోగాఖ్యం
రత్నం సందర్శయామ్యహమ్ ॥

(భావము) ఆళవందారులను నమృత సాగరమున మునింగి భక్తి యోగ మను రత్నమును యథామతి గైకొని చెలుల కనుభవింప దగునట్లు లిచ్చుచున్నా రనుట. ఇక్కడ భక్తియోగ మనునది సాధ్య భక్తియగు ప్రపత్తినే చెప్పున దయ్యెను; ఇందుమిూద "తత్పాదామ్బుజ ద్వయ ప్రపత్తె రన్య న్న మే కల్పకోటి సహస్రేణాపి సాధన మస్తీతి మన్వానః" అని యనుగ్రహించు దానితో బొత్తుకలుగుట కొఱకు.........

ఆళవందారుల శ్రీచరణములం గొల్చిన దాన నేర్పడిన యర్థములను నిత్యానుసంధేయముగా వెల్లడించుచున్నాడ నను నదీ శ్లోకమున బిండీకృతమయిన తాత్పర్యము.

## శ్రీవైకుంఠ గద్యారంభము.

(మూలము) స్వాధీన త్రివిధ చేతనాచేతన స్వరూప స్థితి
ప్రవృత్తి భేదం క్లేశ కర్మాద్యశేష దోషా
సంస్పృష్టం స్వాభావి కానవధికాతిశయ
జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజః ప్రభృత్య
సంఖ్యేయ కల్యాణగుణ గణౌఘ మహార్ణవం
పరమ పురుషం భగవన్తం నారాయణం
స్వామిత్వేన సుహృత్త్వేన గురుత్వేనచ పరి
గృహ్య ఐకాన్తి కాత్యన్తిక తత్పాదాంబు
జద్వయ ప్రపత్తే రన్యన్నమే కల్పకోటి సహ
స్రేణాపి సాధన మస్తీతి మన్వానః తస్యైవ
భగవతో నారాయణస్య అఖిల సత్వద యైక
సాగరస్య అనాలోచిత గుణా గుణాఖణ్డ
జనానుకూలా మర్యాద శీలవతః స్వాభావికా
నవధికాతిశయ గుణవత్తయా దేవతిర్య
ఙ్మనుష్యాద్యఖిల జన హృదయా నందనస్య
ఆశ్రిత వాత్సల్యైక జలధేః భక్తజన
సంశ్లేషైక భోగస్య నిత్యజ్ఞాన క్రియైశ్వర్య
భోగ సామగ్రీ సమృద్ధస్య మహా విభూతేః
శ్రీ మచ్చరణార విన్దయుగలమ్ అనన్యాత్మ

సంజీవనేన తద్గత సర్వభావేన శరణ మను ప్రవజేత్. (1)

1. స్వాధీన త్రివిధ చేతనా చేతన స్వరూపస్థితి ప్రవృత్తి భేదమ్ - ముత్తెఱంగుల చేతనా చేతనముల స్వరూపమేమి రక్షణమేమి ప్రవృత్తినివృత్తులేమి వీనిని తన యధీనమున నుండునవి గాఁగల (దీనికి విశేష వివరణమును......పుటలలో జూడుడు.) క్లేశకర్మాది అశేష దోష అసంస్పృష్టమ్ - అవిద్య మున్నగు నైదు క్లేశములు, పుణ్య పాప కర్మములు, నివి మున్నగా నేవిధ దోష సంబంధమును లేని, (పుట 73 చూడుడు)

స్వాభావిక అనవధికాతిశయ జ్ఞానబల ఐశ్వర్య వీర్య శక్తి తేజః ప్రభృతి అసంఖ్యేయ కల్యాణగుణ గణౌఘ మహార్ణవమ్:—స్వాభావికములుగను,సమాభ్యధికములుగను నుండు షాడ్గుణ్యము మున్నగు కల్యాణగుణ సమూహములకు కడలిం బోలిన (పుట 73 చూడుడు) పరమపురుషం భగవన్తం నారాయణం - పురుషోత్తముఁడై షాడ్గుణ్య పరిపూర్ణుఁడైన శ్రీమన్నారాయణుని, స్వామిత్వేన సుహృత్త్వేన గురుత్వేన చ పరిగృహ్య- శేషిగను హితుఁడుగను ఆచార్యుఁడుగను గొని, ఐకాన్తిక ఆత్యన్తిక తత్పదామ్బుజద్వయ పరిచర్యైకమనోరథః- ఎల్లప్పుడునాభగవంతుని శ్రీచరణ నళినముల కైంకర్యమొకఁ టియే చేయవలయునను పట్టుదలతో, తత్ప్రాప్తయే చ తత్పాదాంబుజద్వయ ప్రపత్తేరన్యత్ నమే కల్పకోటి సహస్రేణాపి సాధన మస్తీతి మన్వానః - ఆకైంకర్యమును బడయుటకు కల్పకోటి సహస్రములైనను నాభగవంతుని శ్రీచరణ నళినములనే

నమ్మియుండుట కన్న వేఱొక యుపాయము లేదని తలచిన వాఁడై, అఖిలసత్త్వ దయైక సాగరస్య - అన్ని ప్రాణులయెడలను గరుణాసింధువై, అనాలోచిత గుణాగుణ అఖండ జనానుకూల అమర్యాద శీలవతః - గుణదోషముల నరయక సకల జనుల కును ననుకూలమైయుండున దను పారములేని శీలగుణమును గలవాఁడును, స్వాభావికా నవధి కాతిశయ గుణవత్తయా దేవ తిర్యఙ్మనుష్యాది అఖిల జనహృదయా నన్దనస్య - సకలప్రాణు లను నానంద పఱచువాఁడునై, ఆశ్రితవాత్సల్యైక జలధేః - దాసులకు దాను వాత్సల్యసముద్రుఁడై, భక్తజన సంశ్లేషైక భోగస్య - భక్తజనులతో గలసి మెలసియుండునదే తనకు పరమసుఖముగా గలవాఁడును, నిత్యజ్ఞాన క్రియైశ్వర్య భోగ సామగ్రీసమృద్ధస్య - నిత్యమును సకల విషయకమైయున్న జ్ఞానము, తనకు లీలయైయున్న క్రియలను, ఐశ్వర్యమును, వీనింబోని భోగసామగ్రులు నిండుకొని యుండువాఁడును, మహావిభూతేః - మిక్కిలి శ్రేష్ఠమైన విభూతిని గలవాఁడయి యున్న, తస్యైవభగవతో నారాయణస్య - ఆభగవంతు నిదే యగు, శ్రీమత్ చరణారవిన్దయుగళమ్ - శ్రీచరణనళినములను, అనన్యాత్మ సంజీవనేన తద్గత సర్వభావేన - ఆత్మోజ్జీవనము ఇయ్యది కాకన్యములేదని యుండునట్టి మైకాన్తికమైన తలం పుతో, శరణం అనువ్రజేత్ - పురుషార్థమున కితఁడే సాధనమని యధ్యవసాయము గొనవలయు ననుట. (1)

ఇట్లొకపరి శరణముచొచ్చి విడువవలయునా యన్నచో పరమపురుషార్థప్రాప్తి కొకపరియే చాలినదై యున్నను కాల క్షేపమునకును మాధుర్యముంబట్టి విడువరానిదై యున్నందు

నను నీయధ్యవసాయము ప్రతిదినము నెడతెగక జరుగవలయు
నని మీాద వచించుచున్నారు.

(మూలము) తతశ్చ ప్రత్యహ మాత్మోజ్జీవనాయ ఏవమను
స్మరేత్ ॥ (11)

తరువాతను ప్రతిదినమును దన్నుజ్జీవింప జేసికొనుటకు నై
యిట్లీయనుస్మృతముగా స్మరింపవలయును (ఇదిమీాద
జెప్పబడుచు) (1)

చతుర్దశ భువనాత్మక మణ్డం దశగుణితోత్తరం చావరణ సప్తకం సమస్తం కార్యకారణ జాతమతీత్య వర్తమానే పరమవ్యోమ శబ్దాభిధేయే బ్రహ్మాదీనాం వాఙ్మనసా గోచరే శ్రీమతి వైకుంఠే దివ్యలోకే సనకవిధి శివాదిభిరప్య చిన్త్య స్వభావైశ్వర్యైర్నిత్య సిద్ధై రనన్తై ర్భగవదానుకూల్యైక భోగైః దివ్యపురుషైర్మహాత్మభిరా పూరితే తేషామపి ఇయత్పరిమాణమ్ ఇయదైశ్వర్యమ్ ఈదృశ స్వభావమ్ ఇతి పరిచ్ఛేత్తుమయోగ్యే దివ్యావరణ శతసహస్రావృతే దివ్యకల్పక శత శోభితే దివ్యోద్యాన శతసహస్ర కోటిభిరావృతే అతిప్రమాణే దివ్యాయతనే కస్మింశ్చి ద్విచిత్ర దివ్యరత్నమయే దివ్యాస్థాన మణ్డపే దివ్యరత్న స్తమ్భ శతసహస్ర కోటిభిరుపశోభితే దివ్యనానారత్న కృతస్థల విచిత్రితే దివ్యాలంకారాలంకృతే పరితఃపతితైః పతమానైః పాదపస్థైశ్చ నానాగన్ధ వర్ణై ర్దివ్యపుష్పైశ్శోభమానైర్దివ్య పుష్పోపవనైరుపశోభతే సంకీర్ణ పారిజాతాది కల్పద్రుమోప శోభితై రసఙ్కీర్ణైశ్చ కైశ్చిదన్తఃస్థ పుష్ప రత్నాది నిర్మిత దివ్యలీలా మణ్డప శతసహస్రోపశోభితైస్సర్వదా

అనుభూయమానైరపి అపూర్వవదాశ్చర్య మావహద్భిః క్రీడాశైలశత సహస్రై రలంకృతైః కైశ్చిన్నారాయణ దివ్య లీలాఽ సాధారణైః కైశ్చిత్పద్మవనాలయాదివ్యలీలాఽసాధారణైస్సాధారణైశ్చ కైశ్చిచ్ఛుక శారికామయూర కోకిలాదిభిః కోమల కూజితైరాకులైర్దివ్యోద్యాన శతసహస్రై రావృతే మణిముక్తా ప్రవాలకృత సోపానైర్దివ్యామలామృత రసోదకైర్దివ్యాణ్డజవరై రతి రమణీయదర్శనై రతిమనోహర మధురస్వరై రాకులైః అన్తఃస్థముక్తామయ దివ్యక్రీడాస్థానోపశోభితై ర్దివ్యసౌగన్ధిక వాపీశత సహస్రై ర్దివ్య రాజ హంసావలీవిరాజితై రావృతే నిరస్తాతిశయానన్దైక రసతయా చానన్త్యాచ్చ ప్రవిష్టానున్మాదయద్భిః క్రీడోద్దేశైర్విరాజితే తత్ర తత్రకృత దివ్యపుష్ప పర్యఙ్కోప శోభితే నానా పుష్పాసవాస్వాద మత్త భృఙ్గావలీభి రుద్గీయమానదివ్య గాన్ధర్వేణా పూరి చన్దనాగరు కర్పూర దివ్యపుష్పావగాహి మన్దానిలాసేవ్యమానే మధ్యే దివ్యపుష్ప సఞ్చయవిచిత్ర మహతి దివ్యయోగపర్యఙ్కే అనన్తభోగిని శ్రీమద్వైకుణ్ఠైశ్వర్యాది దివ్యలోకమ్ ఆత్మకాన్త్యా విశ్వ మాప్యాయ యన్త్యా శేష శేషాశనాది సర్వపరిజనం భగవత స్తత్తదవస్థోచిత పరిచర్యాయా మాజ్ఞాపయన్త్యా శీలరూపగుణ విలాసాదిభిరాత్మానురూపయా శ్రియా సహాసినమ్, ప్రత్యగ్రోన్మీలిత సరసిజ సదృశనయన యుగలమ్, స్వచ్ఛనీల జీమూత సఙ్కాశమ్, అత్యుజ్జ్వల పీతవాససమ్ స్వయా ప్రభయా అతినిర్మలయా అతిశీతలయా స్వచ్ఛయా మాణిక్యాభయా కృత్స్నం

జగద్వ్యాపకయస్తమ్, అచిన్త్య దివ్యాద్భుత నిత్యయౌవనస్వభావలావణ్య మయామృత సాగరమ్, అతిసౌకుమార్యా దీషత్ప్రస్విన్న వదాలక్ష్యమాణ లలాటఫలక దివ్యాలకావలీ విరాజితమ్, ప్రబుద్ధముగ్ధామ్బుజ చారులోచనమ్, సవిభ్రమభ్రూలతమ్, ఉజ్జ్వలాధరమ్, శుచిస్మితమ్, కోమలగణ్డమ్, ఉన్నసమ్ ఉదగ్రపీనాంస విలమ్బికుణ్డలాలకావలీబన్ధురకమ్బు కన్ధరమ్, ప్రియావతంసోత్పల కర్ణభూషణ శ్లథాలకాబన్ధ విమర్దశంసిభిశ్చతుర్భి రాజానువిలమ్బిభిర్భుజైర్విరాజితమ్, అతికోమలదివ్యరేఖాలఙ్కృతా తామ్రకరతలమ్, దివ్యాఙ్గులీయకైర్విరాజితమ్, అతికోమలదివ్యనఖావలీ విరాజితాతిరక్తాఙ్గులీ భిరలఙ్కృతమ్, తత్క్షణోన్మీలిత పుణ్డరీకసదృశ చరణయుగలమ్, అతిమనోహర కిరీటమకుట చూడావతంస మకరకుణ్డల గ్రైవేయక హారకేయూరకటక శ్రీవత్సకౌస్తుభముక్తా దామోదరబన్ధనపీతామ్బర కాఞ్చీగుణ నూపురాదిభి రత్యన్తసుఖస్పర్శై ర్దివ్యగన్ధైర్భూషణై ర్భూషితమ్, శ్రీమత్యా వైజయన్త్యా వనమాలయా విరాజితమ్,

శఙ్ఖచక్ర గదాసి శార్ఙ్గాది దివ్యాయుధైః సేవ్యమానమ్, స్వసంకల్పమాత్రావక్లృప్తజగజ్జన్మస్థితి ధ్వంసాదికే శ్రీమతివిష్వక్సేనే న్యస్తసమస్తాత్మైశ్వర్యమ్, వైనతేయాది భిస్స్వభావతో నిరస్తసమస్త సాంసారిక స్వభావైర్భగవత్పరిచర్యాకరణయోగ్యైర్భగవత్పరిచర్యైక భోగైర్నిత్య సిద్ధైరనన్తైర్యథాయోగం సేవ్యమానమ్, ఆత్మభోగేన అననుసంహిత పరాదికాల దివ్యామల కోమలావలోకనేన విశ్వమాహ్లాద

యన్తమ్, ఈషదున్మీలిత ముఖామ్బుజోదర వినిర్గతేన దివ్యాననారవిన్ద శోభాజనకేన దివ్యగామ్భీర్యౌదార్య సౌన్దర్య మాధుర్యా ద్యనవధిక గుణగణ విభూషితేన అతి మనోహర దివ్యభావగర్భేణ దివ్యలీలాలాపామృతేన అఖిల జనహృదయా న్తరాణ్యాపూరయ న్తమ్ భగవ న్తమ్ నారాయణమ్ ధ్యానయోగేన దృష్ట్వా (తతో) భగవతో నిత్య స్వామ్యమ్, ఆత్మనో నిత్యదాస్యంచ యథావస్థిత మను సన్ధాయ, కదాఽహం భగవ న్తం నారాయణం మమకులనాథం మమకులదైవతం మమకులధనం మమభోగ్యం మమమాతరం మమపితరం మమసర్వం సాక్షాత్కరవాణి చక్షుషా, కదాఽహం భగవత్పాదామ్బుజద్వయం శిరసాధారయిష్యామి; కదాఽహం భగవత్పాదామ్బుజద్వయ పరిచర్యాకరణయోగ్యః తదేకభోగ స్తత్పాదౌ పరిచరిష్యామి; కదాఽహం భగవత్పా దామ్బుజద్వయ పరిచర్యాశయా నిర స్తసమస్తేతర భోగాశః అపగతసమ స్త సాంసారిక స్వభావః తత్పాదామ్బుజద్వయం ప్రవేక్ష్యామి, కదామాం భగవాన్ స్వకీయయా అతిశీతలయా దృశా అవలోక్య స్నిగ్ధగమ్భీర మధురయాగిరా పరిచర్యాయామాజ్ఞాపయిష్యతి” ఇతి భగవత్పరి చర్యాయామ్ ఆశాం వర్ధయిత్వా, తయైవాశయా తత్ప్రసాదోపబృంహితయా భగవ న్త ముపేత్య,

దూరాదేవ భగవ న్తం శేషభోగే శ్రియాసహాసీనం వైనతేయాదిభిస్సేవ్యమానం “సమ స్త పరివారాయ శ్రీమతే నారాయణాయనమః” ఇతిప్రణమ్య, ఉత్థా యోత్థాయపునః పునఃప్రణమ్య అత్య న్త సాధ్వసవినయావనతోభూత్వా, భగవ

ర్పారిషదగణ నాయకైర్ద్వారపాలైః కృపయా స్నేహగర్భయా దృశాఽవలోకితః సమ్యగభివన్దితైస్తై రేవానుమతః భగవన్త ముపేత్య శ్రీమతా మూలమన్త్రేణ ("భగవన్!") మామ్ ఐకాన్తికాత్యన్తిక పరిచర్యాకరణాయ పరిగృహ్ణీష్వ " ఇతి యాచమానః ప్రణమ్యాత్మానం భగవతే నివేదయేత్."

(సూచన - ఇయ్యది మిక్కిలి పెద్దదైన చూర్ణిక. ఇకపై నొనర్పబడిన వివరణమునందు నుటంకింపబడిన పూర్ణమైన చూర్ణికనను సంధించుకొనునది. ఇందువిశేషణ విశేష్యములనేకములున్నవి. అక్కడక్కడగల విశేషణములే విశేష్యముతో ముగియునను నందించుక శ్రమపడి తెలియవలయును. అందుల కనుకూలముగా నక్కడక్కడమేము క్రింద గీటుంచి సూచించు టంబట్టి తెలిసికొనునది.)

| | |
|---|---|
| 3. చతుర్దశ భువనాత్మకమ్ | పదునాలుగు లోకములుగల |
| అణ్డం దశగుణితోత్తరం చ ఆవరణ సప్తకం సమస్తం కార్య కారణ జాతమధీత్య | యండమును పైపై పదింత లెక్కువగ వ్యాపించినసప్తావరణములను మఱియు గల సమస్త కార్యకారణవర్గమును గడచి యావల వెల యుచున్న, |
| పరమవ్యోమ శబ్దాభిధేయే | పరమాకాశమని చెప్పబడుచున్న, |
| బ్రహ్మాదీనాం వాఙ్మనస అగోచరే | బ్రహ్మమున్నగు వారలయు వాక్కునకు గాని మనస్సునకు గాని యందని, |

| | |
|---|---|
| శ్రీమతి వైకుంఠే దివ్యలోకే సనకవిధి శివాదిభిరపి అచిన్త్య స్వభావైశ్వర్యైః నిత్యసిద్ధైః అనన్తైః భగవదానుకూల్యైకభోగైః దివ్యపురుషైః మహాత్మభిః ఆపూరితే | శ్రీవైకుంఠ దివ్యలోకమునందు (బ్రహ్మభావనలో నగ్రగణ్యులైన) సనకాదులకును (కర్మభావనలో నగ్రగణ్యులైన) బ్రహ్మ రుద్రాదులకును దలంపరానట్టిదైనప్రకారవైభవములనుగల వారై సంతతము భగవదనుభవనిరతులై యసంఖ్యాకులై భగవంతునెడ ననుకూల స్వభావమే రూపు గొన్నవారలై మంటిపైఁగాలిడనివారలైన మహాత్ములచే నిండినదై, |
| తేషామపి ఇయత్పరిమాణం ఇయదైశ్వర్యం ఈదృశస్వభావమితి పరిచ్ఛేత్తుం అయోగ్యే | ఆమహాత్ములకును గణింపవలనుగానిదగు పరిమాణము ఐశ్వర్యము, స్వభావమునను వీనిని గలిగినదై, |
| దివ్యఆవరణ శతసహస్ర ఆవృతే | లోక విలక్షణమైన వేలకొలది ప్రాకారములు గలదై |
| దివ్య కల్పకతరు ఉపశోభితే | అప్రాకృతమైన కల్పక తరువులచే వెలయునదై, |
| దివ్యోద్యాన శతసహస్ర కోటిభిః ఆవృతే | వేనవేలుద్యానములచే జుట్టబడినదై |

| | |
|---|---|
| అతిప్రమాణే దివ్య ఆయతనే | పొడవు వెడల్పులు గణింప రానిదైయున్న యాలయమున |
| కస్మింశ్చిత్ విచిత్ర దివ్య రత్నమయ దివ్య ఆస్థాన మణ్డపే | పలువిధములైన దివ్యరత్నములచే వెలుగొందు నొక సభా మంటపమున |
| దివ్య రత్న స్తమ్భ శతసహస్ర కోటిభిః ఉపశోభితే | కోటానుగోటులు మాణిక్య స్తంభములచే వెలుగొందునదై |
| దివ్య నానారత్న కృతస్థల విచిత్రితే | అప్రాకృతమైన పలు తెఱంగుల మాణిక్యములు పొదివిన నేల కలదై |
| దివ్య అలంకార అలంకృతే | దివ్యాలంకారములచే నలంకరింపబడినదై |
| పరితః పతితైః పతమానైః పాదపస్థైశ్చ నానాగన్ధ వర్ణైః దివ్యపుష్పైః శోభమానైః | నలుప్రక్కలను రాలినవియు రాలుచున్నవియు చెట్టునందున్నవియునగు పలువిధముల సువాసనల నెగ |
| దివ్యపుష్ప ఉపవనైః ఉపశోభితే | జిమ్ము లతాంతమ్ములతో నిమ్మైన నొప్పు నుద్యానమ్ములతో శోభిల్లునదై |

| | |
|---|---|
| * సంకీర్ణ పారిజాతాది కల్ప ద్రుమ ఉపశోభితైః | ఒకదానితో నొకటి కలసి యుండు పారిజాతము మున్నగు కల్పవృక్షములతో నొప్పునవియు |
| అసంకీర్ణైశ్చ కైశ్చిత్ | ఒకదానితో నొకటి కలయక యున్నవి కొన్నియు |
| అన్తస్థిత పుష్పరత్నాదినిర్మిత దివ్యలీలా మణ్డప శతసహ స్రోప శోభితైః | లోనున్న-పుష్పము రత్నము మున్నగు వానిచే నమర్ప బడిన వేనవేలు లీలామండ పములచే వెలయునవియును |
| సర్వదా అనుభూయమానై రపి అపూర్వవత్ ఆశ్చ ర్యం ఆవహాద్భిః | ఎల్లప్పుడు ననుభవింపబడు చున్నదయ్యు నపూర్వ మైన వస్తువులంబలె నచ్చె రువు గల్గించు నవియును |
| క్రీడాశైల శతసహస్రైరలం | వేనవేలు క్రీడాశైలమ్ములచే నలంకరింప బడినవియును |
| కైశ్చిత్ నారాయణ దివ్య లీలా అసాధారణైః కైశ్చి త్ పద్మవనాలయా దివ్య లీలా అసాధారణైః సాధా | భగవంతుని లీలలకై యు న్నవి కొన్నియు, శ్రీదేవి లీలకైనవి కొన్నియు, నిరు వురి లీలలకునై యున్నవియు |

* ఇది మున్నగ తృతీయాంత విశేషణములకు విశే ష్యము 'దివ్యోద్యాన శత సహస్రైః' అనునది.

| | |
|---|---|
| రైశ్చకైశ్చిత్ కోమలకూజితైః శుకశారికా మయూర కోకిలాదిభిః ఆకులైః దివ్యోద్యాన శతసహస్రైః ఆవృతే | కొన్నియునగు విన్నాణమైనస్వరముగల చిలుకలు మున్నుగా పక్షుల కోలాహలముతో నొప్పిన దివ్యమైన కోటానంగోటు లుద్యానములచే చుట్టబడినదై |
| మణిముక్తా ప్రవాలకృత సోపానైః | రత్నములు, ముత్యములు, పగడములు మున్నగు వానిచే జేయబడిన మెట్లను గలిగినవై |
| దివ్య అమల అమృత రసోదకైః | అప్రాకృతమును నిర్మలమును నమృతమువలె రసవంతమును నగు నీటిని గలిగినవై |
| అతిరమణీయ దర్శనైః అతిమనోహర మధురస్వరైః దివ్యాణ్డజవరైః ఆకులైః | కంటికింపైనవియు మాటలో డియ్యందనమును గలిగినవియునగుఅప్రాకృతపక్షులచే వ్యాప్తములై, |
| అన్తస్థ ముక్తామయ దివ్య క్రీడా స్థాన ఉపశోభితైః | లోనంగల - ముత్యములచే నైన లీలాస్థానములతో శోభితములై, |

| | |
|---|---|
| దివ్య రాజహంసావళీ విరాజితైః | శుద్ధ సత్వమయమైన రాజహంసములతో విరాజిలునదైన |
| దివ్య సౌగన్ధిక వాపీశత సహస్రైః ఆవృతే | అప్రాకృతమైన వేనవేలు నడబావులు నిండుకొనియున్నదై |
| నిరస్తాతిశయ ఆనందైక రసతయాచ ఆనన్త్యాచ్చ ప్రవిష్టాన్ ఉన్మాదయద్భిః క్రీడోద్దేశైః విరాజితే | నిరతిశయమగు నానందమే రూపుగొని యుండుట చేతనుసర్పించిన్నమై యుండుట చేతను లోనం జొచ్చిన వారల మోహపెట్టంగల లీలాస్థానములతో వెలయునదై, |
| తత్ర తత్రకృత దివ్యపుష్ప పర్యఙ్క ఉపశోభితే | అట నటజక్కగా నొనర్పబడిన పూల పాన్పులతో విరాజిల్లునదై |
| నానాపుష్ప ఆసవ ఆస్వాద మత్త భృఙ్గ ఆవలిభిః ఉద్గీయమాన దివ్యగాన్ధర్వేణ ఆపూరితే | పలు తెరంగులైన పుష్పములం దుప్పతిల్లిన తేనెం గ్రోలి తనిసిన తుమ్మెదల పిండు లులియు దివ్యగీతములు మెండుకొన్నదై, |
| చన్దన అగరుకర్పూర దివ్య పుష్ప అవగాహి మన్దానిల ఆసేవ్యమానే | చందనము, అగరు, పచ్చకర్పూరము దివ్య పుష్పములు ననుపీనం జొచ్చి యందలి |

| | |
|---|---|
| | సుగంధమును జూఅలాడి వెదజల్లుచు వీచు మంద మారుతముతో నొప్పినదై |
| మధ్యే దివ్యపుష్ప సంచయ విచిత్రితే | నడుమ దివ్యపుష్పములతో జిత్రింపఁబడినదై |
| మహతి దివ్యయోగ పర్యఙ్కే అనన్త భోగిని | మిక్కిలి గొప్పదైన మంచముపై, శేషుఁడను పాప ఱేనిపై, |
| శ్రీమత్ వైకుంఠైశ్వర్యాది దివ్యలోకం విశ్వమ్ ఆత్మకాన్త్యా ఆప్యాయయన్త్యా | శ్రీవైకుంఠము నందలి సంపదలు మున్నగ దివ్యలోక మెల్లఁ దనకాంతిచే వెలుంగజేసి తనివు పుట్టించి |
| శేష శేషాశనాది సర్వపరిజనం భగవతః తత్తదవస్థోచిత పరిచర్యాయామ్ ఆజ్ఞాపయన్త్యా | శేషుఁడు మున్నగు సకల పరిజనమును భగవంతుని యాయాదశలకుం దగిన కైంకర్యములందు నియమించునదియు |
| శీల రూపగుణ విలాసాదిభిః ఆత్మానురూపయా | శీలము రూపము గుణము శృంగారవిలాసము మున్నగువానిచేఁ దనకుఁ దగినదియునైన |
| శ్రియాసహ | శ్రీదేవితో |
| ఆసీనమ్ | వెలసియున్న వాఁడును |

| | |
|---|---|
| ప్రత్యగ్ర ఉన్మీలిత సరసిజ సదృశనయన యుగళమ్ | అప్పుడు వికసించిన చెందమ్మి వోలె కనుదోయింగల వాడును |
| స్వచ్ఛనీల జీమూత సంకాశమ్ | అచ్ఛంపు గారు మొయిలుం బోని నెమ్మేనిం గలవాడును |
| అత్యుజ్జ్వల పీతవాససమ్ | మిక్కిలి మెఱయు బంగారు వలువం దాల్చినవాడును |
| అతినిర్మలయా అతిశీతలయా (అతికోమలయా) స్వచ్ఛయా మాణిక్యాభయా స్వయా ప్రభయా కృత్స్నం జగత్ భాసయన్తమ్ | మిక్కిలి నిర్మలమై మిక్కిలి చల్లనిదై (మిక్కిలి సుకుమారమై) స్వచ్ఛమై మాణిక్యముంబోలిన తన దివ్యకాంతిచే లోకము నెల్ల వెలయం జేయుచున్న వాడును |
| అచిన్త్య దివ్య అద్భుత నిత్య యౌవన స్వభావ లావణ్యమయ అమృతసాగరమ్ | తలంపున కందనిదై దివ్యమై ఆశ్చర్యమై నిత్యమైయున్న యౌవనము స్వభావముగాఁగలిగిన యమృతంపు గడలియై |
| అతిసౌకుమార్యాత్ ఈషత్ ప్రస్విన్నవత్ ఆలక్ష్యమాణ లలాటఫలక దివ్య | మిక్కిలి సుకుమారమగుట చే నించుక చెమర్చినదై కానవచ్చు నుదుట నల్లల |

# శ్రీ వైకుణ్ఠగద్యము

| | |
|---|---|
| అలక ఆవలీ విరాజితమ్ | నాడు ముంగురులు సొబగార నుండువాడై |
| ప్రబుద్ధ ముగ్ధామ్బుజ చారు లోచనమ్ | అప్పుడే వికసించిన తామరంబోలిన చక్కని నయనంబులం గలిగినవాడై |
| సవిభ్రమ భ్రూలతమ్ | విలాసముతో గూడిన కనుబొమలం గలవాడై |
| ఉజ్జ్వల అధరమ్ | మిక్కిలి మెఱయు పెదవిం గలవాడై |
| శుచిస్మితమ్ | కపటములేని చిఱునగవుకలవాడై |
| కోమలగణ్డమ్ ఉన్నసమ్ | చక్కని చెక్కిళ్లతో నొప్పువాడై ఎత్తైననాసిక కలవాడై |
| ఉదగ్ర పీన అంస విలంబి కుణ్డల అలకావలీ బన్ధుర కమ్బు కన్ధరమ్ | గొప్పలై బలిసియున్న మూపులదనుక నాడు కుండలములచేతను, కురులచేతను సొబగారు శంఖంబుంబోని కంఠంబుం గలవాడై |
| ప్రియా అవతంస ఉత్పల కర్ణభూషణ శ్లథ అలకా బన్ధ విమర్ద శంసిభిః ఆజాను | దేవులకు కర్ణాలంకారమైన కలువలేమి, కర్ణభూషణములేమి, చెదరినకురులేమి |

| | |
|---|---|
| విలంబిభిః చతుర్భిః భుజైః విరాజితమ్ | వీనియొత్తిడులం దెలుపుచు మోకాళ్లదనుక వ్రేలాడు నాలుగు కరములతోఁ బ్రకాశించువాఁడై |
| అతికోమలదివ్య రేఖా అలంకృత ఆతామ్ర కరతలమ్ | మిక్కిలిచక్కని (తామర శంఖము చక్రము మున్నగు) రేఖలచే నలంకరింపబడి యించుక యెఱ్ఱనిదై యొప్పు దివ్యకరతలముల గలవాఁడై |
| దివ్య అంగులీయకైః విరాజితమ్ | అప్రాకృతమైన యుంగరములచే వెలుఁగొందువాఁడై |
| * అతికోమల దివ్య నఖావలీ విరాజిత అతి రక్తాంగులీభిః అలంకృతమ్ | మిక్కిలి సుకుమారమైన గోళ్లచే వెలుగొందు మిక్కిలి యెఱ్ఱని వ్రేళ్లచే నలంకరింపబడినవాఁడై |
| తత్ క్షణ ఉన్మీలిత పుణ్డరీక సదృశ చరణ యుగలమ్ | అప్పుడువికసించిన పుండరీకముంబోలిన దివ్యచరణ యుగమును గలవాఁడై |

* 'అతికోమల దివ్యనఖావలి విరాజితం' అని నడుమ పదముల విడదీసి భగవంతునకు నదియు నొక విశేషణముగా నొనర్చునదియుంగలదు. అనురక్త, అతిరక్త అనునవి పాఠ భేదములు; అర్థమొక్కటే.

| | |
|---|---|
| అత్యన్త సుఖస్పర్శైః దివ్యగన్ధైః అతిమనోహర కిరీట మకుట చూడావతంస మకరకుండల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామ ఉదరబన్ధన పీతాంబర కాంచీగుణ నూపురాదిభిః భూషణైః భూషితమ్ | మిక్కిలి సుఖమైన స్పర్శముగలవియు దివ్యమైన పరిమళమును గలిగినవియు నగు మిక్కిలి చక్కని కిరీటము ...... నూపురము మున్నగు దివ్య భూషణములచే నలంకృతుడై (శరణాగతిగద్యమున విపుల వ్యాఖ్యను జూచునది) |
| శ్రీమత్యా వైజయన్త్యా వనమాలయా విరాజితమ్ | చక్కని వైజయంతియను వనమాలతో వెలయువాఁడై |
| శఙ్ఖ చక్రగదా అసి శార్ఙ్గాది దివ్యాయుధైః సేవ్యమానమ్ | పంచాయుధములు మున్నగు దివ్యాయుధములచేఁ గొలువఁబడుచున్నవాఁడై |
| స్వసఙ్కల్పమాత్ర అవక్లుప్త జగత్ జన్మస్థితి ధ్వంసాదికే శ్రీమతి విష్వక్సేనే న్యస్త సమస్త ఆత్మైశ్వర్యమ్ | తలచినంతనే సకల జగముల సృష్టిస్థితి సంహారాదులను నిర్వహింప సమర్థుడగు విష్వక్సేనుల యెడ దన నియమన సంపదనెల్ల నొప్పగించినవాఁడై |
| వైనతేయాదిభిః స్వభావతః నిరస్త సమస్త సాంసారిక | స్వభావము చేతనే సాంసారిక స్వభావ మొక్కటియు లేని |

స్వభావైః భగవత్పరిచర్యాకరణయోగ్యైః భగవత్పరిచర్యైకభోగైః **ని**త్యసిద్ధైః అనన్తైః యథాయోగం సేవ్యమానమ్

వారును భగవంతున కెల్లప్పుడు దాస్యమొనర్చుచుండువారును, ఆ కైంకర్యమునే నిత్యభోగముగా గలవారలునైన వైనతేయుడు మున్నగు నసంఖ్యాకులగు **నిత్య**సూరులచే తగురీతిని గొలువబడుచున్నవాడై

* ఆత్మభోగేన అననుసంహితపరాదికాలమ్

స్వాత్మానుభవముచేత నింత యని పేర్కొనరానికాలము గడచుట నెఱుంగనివాడై

* ఆత్మభోగేన యనునీచోట నాచ్చాన్పిళ్ళైవారి పాఠము వేఱొకతీరున నున్నట్టులు గానవచ్చుచున్నది. "ఇక్కటాక్షమ్ పరార్థమాక వన్నికే - కాలతత్త్వముళ్ళదనైయుమ్ స్వప్రయోజనమాకవను సన్నిక్క-ప్పట్టు విలక్షణమాయ్ అపరాధఙ్గళై నినైత్తుక్క-లంగుకై యన్నికే - సుప్రసన్న సున్దరమాన కటాక్షత్తాలే" యని ఆచ్చాన్ పిళ్ళైవారు వ్యాఖ్యానించిరి. కాన "అననుసంహిత" యనుచోట 'అనుసంహిత' యను పాఠముకు 'పరాదికాలమ్' అని ప్రత్యేకముగా (భగవద్విశేషణముగా) కాక సమస్తపదమై అవలోకన విశేషణముగా గ్రహించు పాఠమును గలదని తోచెడిని. పలు శ్రీకోశములందును బెద్దల యనుసంధానమునను గాన

| | |
|---|---|
| దివ్య అమల కోమల అవ లోకనేన విశ్వమ్ ఆహ్లాదయన్తమ్ | దివ్యమై నిర్మలమై సుందరమైన కటాక్ష వీక్షణముచే సమస్తవస్తువులను సంతోషపఱుపఁగలవాడై |
| ఈషదున్మీలిత ముఖాంబుజ ఉదరవినిర్గతేన దివ్యానానారవిన్ద శోభాజననేన దివ్యగాంభీర్య ఔదార్య సౌన్దర్య మాధుర్యాది అనవధిక గుణగణ విభూషితేన అతిమనోహర దివ్యభావగర్భేణ దివ్యలీలాలాప అమృతేన అఖిలజనహృదయాన్తరాణి ఆపూరయన్తం భగవన్తం నారాయణమ్ | ఇంచుక వికసించిన దివ్యముఖారవిందమున గలిగినదై దివ్యాననారవిందమునకు భూషణముంబలెజక్కదనమును గూర్చునదై దివ్యమైనగాంభీర్యము ఔదార్యము మాధుర్యము మున్నగు సకల సద్గుణములచే నలంకరింపబడినదై యతిమనోహరాభిప్రాయ విశేషములోనం గలిగియున్న దివ్యమైన |

వచ్చు పాఠమే యిందు గ్రహింపబడెను. ఆత్మభోగమనగా :— * ప్రశాన్తానన్దాత్మానుభవజ * యని వరదరాజస్తవసూక్తిలో ప్రస్తావింపబడిన పరమపదనాథునకు గలిగిన స్వాత్మానుభవము ; బ్రహ్మయొక్క ఆయుష్కాలమునకు పరమనిపేరు, అట్టి మిక్కిలి గొప్పదగు కాలపరిమాణమును దెలియక గడచిపోవుచున్నదట స్వాత్మానుభవమున, ' క్షణాణువత్ క్షిప్తపరాదికాలయా' యనుస్తోత్రరత్నమందలి శ్రీసూక్తిని గనునది.

| | |
|---|---|
| | రసోక్తియగు సమృతము నెల్లర హృదయములందు ను నింపువాడగు భగవంతుని నారాయణుని |
| ధ్యానయోగేన దృష్ట్వా | సాక్షాత్కారముంబడసి |
| (తతః) భగవతః నిత్యస్వా మ్యమ్ ఆత్మనః నిత్య దాస్యం చ యథావస్థి తమ్ అనుసన్ధాయ | (తరువాత) ఆ భగవంతునకు స్వభావముగాగల శేషి త్వమును దనకు స్వభావ ముగాగల శేషత్వమును నున్నదున్నట్టులనుసంధించి |
| కదా అహం భగవన్తం నా రాయణం మమకులనాథం మమ కులదైవతం మమ కులధనం మమభోగ్యం మమమాతరం మమపితరం మమసర్వం సాక్షాత్కర వాణి చక్షుషా | నాకులనాథుడై నాకులదైవ మై నా కులసంపదయై నాకు పరమ భోగ్యుడై నాకు తల్లియై తండ్రియై సర్వమునైన భగవంతుడు నారాయణుని నేనెప్పుడు కన్నులార జూడ గలుగు దును? (అనియు) |
| కదా అహం భగవత్ పా దాంబుజద్వయం శిరసా సఙ్గ్రహీష్యామి (ధార యిష్యామి) | భగవంతుని శ్రీ చరణనళిన ముల నెప్పుడు నాతలపై ధరింప గలుగుదును? (అనియు) |

| | |
|---|---|
| కదాఽహం భగవత్పాదాంబుజద్వయ పరిచర్యాశయా నిరస్త సమస్తేతర భోగాశః అపగత సమస్త సాంసారికస్వభావః తత్పాదాంబుజద్వయం ప్రవేక్ష్యామి | భగవంతుని శ్రీచరణ నళినయుగళమున కైంకర్య మొనర్పనాశ కలిగి విషయాంతరము లందాశ వీడి (రాగద్వేషాదులగు) సమస్త సాంసారికస్వభావములు లేక దాసుఁడ నెల్లప్పుడు నతని చరణముల నేనెప్పుడు చేపట్ట గలుగుదును? (అనియు) |
| కదాఽహం భగవత్పాదాంబుజద్వయ పరిచర్యాకరణయోగ్యః తదేకభోగః తత్పాదౌ పరిచరిష్యామి | ఎప్పటికి నేను శ్రీచరణములందు దాస్య మొనర్ప గలవాఁడనై యాదాస్యమున నాసక్తి కలిగి యాచరణములందుదాస్యముం బూన గలుగుదును? (అనియు) |

(ఈవాక్యమునకు తరువాత మునుపటి వాక్యమును చెప్పు పాఠమునుగలదు)

| | |
|---|---|
| కదా మాం భగవాన్ స్వకీయయా అతి శీతలయా దృశా అవలోక్య స్నిగ్ధ గమ్భీరమధురయా గిరా పరిచర్యాయామ్ ఆజ్ఞాపయిష్యతి ఇతి | ఆ భగవంతుఁడు తన మిక్కిలి చల్లని దృష్టులచే గటాక్షించి మధురములగు పలుకులతో తనివార బలికి పను. లొనరించుకొని) కైంకర్యమున నన్ను దవిలియుండ జేయున దెన్నఁడో |

| | |
|---|---|
| | యనియు (కాగా నిల్లెల్ల మదినిం గోరి) |
| భగవత్ పరిచర్యాయామ్ ఆశాం వర్ధయిత్వా | భగవంతుని కైంకర్యమున నాశను పెంచి |
| తత్ప్రసాద ఉపబృంహితయా తయైవ ఆశయా | ఆ భగవంతుని యనుగ్రహము చేత పెంపొందు నాసక్తితో |
| భగవన్తమ్ ఉపేత్య | భగవంతు నెడ కరిగి |
| శేషభోగే శ్రియా సహ ఆసీనం వైనతేయాదిభిః సేవ్యమానం భగవన్తం 'సమస్త పరివారాయ శ్రీమతే నారాయణాయ నమః' ఇతి దూరాత్ ఏవ ప్రణమ్య | శేషునందు శ్రీదేవితో కూడ నుండి గరుత్మంతుడు మున్నగు నిత్యసూరులచేత సేవితుడైయున్న యా భగవంతుని సమస్తపరివార సమేతుడైన శ్రీమన్నారాయణునకు నమః' అని పలికి దూరరమందుండియే నమస్కరించి |
| ఉత్థాయ ఉత్థాయ పునః పునః ప్రణమ్య | (నడచి పోవులంగాక) ప్రణామపరంపరలతోనే సమీపించి |
| అత్యన్త సాధ్వస వినయావనతః భూత్వా | మిక్కిలి జంకుతోను వినయముతోను మ్రొక్కి నిలిచి |
| భగవత్ పారిషద గణనాయకైః ద్వారపాలైః కృపయా | భగవంతుని సభలో వెలసియుండు గణనాథులు వా |

| | |
|---|---|
| స్నేహగర్భయా దృశా అవలోకితః | కిటి కావలివాండ్రు మున్నగువారలచేగృపతో బ్రేమతో గటాక్షింపబడినవాడనై |
| సమ్యక్ అభివన్దితైః తైస్తైరేవ అనుమతః | చక్కగా నమస్కరింపబడిన వారల యనుమతిని బడసి |
| భగవన్తమ్ ఉపేత్య శ్రీమతా మూల మన్త్రేణ | భగవంతుని సమీపించి శ్రీమంతమగు నష్టాక్షర మహా మంత్రముచేత |
| మామ్ ఐకాన్తిక ఆత్యన్తిక పరిచర్యా కరణాయ పరిగృహ్ణీష్వ ఇతి యాచమానః ప్రణమ్య | దాసునన్య నిత్యకైంకర్యము సందవిలి యుండం జేసి చేకొనవలెనని యాచించి మ్రొక్కి |
| ఆత్మానం భగవతే నివేదయేత్ | తన్నా భగవంతునకు సమర్పింపవలయును (4) |

(మూలము) తతోభగవతా స్వయమేవ ఆత్మ సంజీవనేన అమర్యాద శీలవతా అతి ప్రేమాన్వితేన అవ లోకనే నావలోక్య సర్వదేశసర్వకాల సర్వావస్థోచితాత్యంత శేషభావాయ స్వీకృతః అనుజ్ఞాతశ్చ అత్యంత సాధ్వసవినయావనతః కింకుర్వాణః కృతాంజలిపుటో భగవన్త ముపాసీత (5)

తతః - ఆత్మసమర్పణా నంతరము, భగవతా స్వయమేవ-
భగవంతుడు తానుగానే, ఆత్మసంజీవనేన **అమర్యాదశీలవతా**
అతిప్రేమాన్వితేన అవలోకనేన అవలోక్య- **ఆత్మ**సముజ్జీవన
హేతువై పారమెయ్యిన శీలగుణమును ప్రదర్శించునదై మిక్కిలి
ప్రేమతో గూడినదైన కటాక్షముతో జూచి, సర్వదేశ సర్వ
కాల సర్వావస్థోచిత అత్యన్తశేష భావాయ స్వీకృతః—సర్వ
కాలమందును సర్వావస్థలందును దగిన **దాస్యము** నొనర్ప
జేసి స్వీకరింపగా **నాభాగ్యము** గలవాడనై, అనుజ్ఞాతశ్చ-
అనుజ్ఞను బడసినవాడనై, అత్యన్తసాధ్వస వినయ **అవనతః**
కిఙ్కర్వాణః కృతాంజలి పుటః భగవన్తమ్ ఉపాసీత - మిక్కి-
లి వెఱగుపడియు వినయము గలిగియు తలవాల్చి పనివాడ
నైయుండి మొగిచిన కేలుదోయితో నాభగవంతు ననుసరించి
యుందును.

(మూలము) తతశ్చానుభూయమాన భావవిశేషః నిరతి
శయప్రీత్యా అన్యత్ కించిత్ కర్తుం ద్రష్టుం
స్మర్తుమశక్తః పునరపి శేషభావమేవ యాచ
మానః భగవన్తమేవ అవిచ్ఛిన్న స్రోతోరూ
పేణావలోకనేన అవలోకయన్నాసీత. (6)

**తర్వాతను** భగవంతుని స్వరూప స్వభావాదుల ననుభవించు
చునెల్లలేని ప్రేమతో వేఱొకటిచేయుట **చూచుట** తలంచుట
లనునవి చేయజాలక (శేషత్వమునుబడసి **యుండియు** దాని
మాధుర్యవిశేషమున నిది నిలుకడగా నుండునాయని యతిశం
కగొని) మరియు నిట్టి శేషవృత్తి నిలుకడగా నెలకొనవలయు

నని వేడుచు శ్రీవైకుంఠనాథునే యెడతెగని ధారారూపమున గన్నుల పండువుగా గనుచు నుండగలవాడు. (6)

(మూలము) తతో భగవతా స్వయమేవాత్మ సంజీవనేనావ
లోకనేనావలోక్య సస్మితమాహూయ
సమస్తక్లేశాపహం నిరతిశయ సుఖావహ
మాత్మీయం శ్రీమత్పాదారవిన్దయుగలం శిర
సికృతం ధ్యాత్వా అమృతసాగరాన్తర్నిమ
గ్న సర్వావయవస్సుఖ మాసీత. (7)

శ్రీమద్రామానుజాచార్య లనుగ్రహించిన
శ్రీవైకుంఠగద్యము ముగిసెను.

ఎమ్పెరుమానార్ తిరువడిగళే శరణమ్.

---

తరువాత నతని స్వరూపమునే ధ్యానించుచు నిలువ, నా భగవంతుడు చక్కని కనుదోయిం దెఱచి కడగంటిచూడ్కులచే జల్లగా జూచి చిఱునగవొనర్చి యిటురమ్మని దివ్యవదనము దెఱచి చేరంజీరి, సకలక్లేశములును బోవునట్టులుగ నిక దీని కెక్కుడెందును లేదన గలుగునట్టు లానందమును జేకూర్చునట్టి శ్రీచరణ నళినముల దన తలపై నిడి యనుగ్రహించినట్టులుగ ధ్యాస మొనర్చి యానంద సాగరమున నిలువెల్ల మునుగ గని తనిసియుండును. (7)

## వ్యాఖ్యాన నిగమనము.

స్వరూపానురూపమైన ప్రపత్తియే శరణ్యమనికొని ప్రాకృత మండలమును వీడిచని అప్రాకృత మగు దేశవిశేషముం జొచ్చి

సర్వాంగ సుందరుడై సర్వాభరణ భూషితుడై దివ్యాయుధ శోభితుడై నిత్య సూరి పరిషన్నిషేవితుడై యుండు శ్రీ వైకుంఠనాథునిం జేరి కైంకర్యప్రార్థనను మున్నిడుకొని నిరంతర మతని దాస్యమున దవిలియుండ నొనర్చు పరిచర్యల స్వీకరించి ఆనంద సముద్రమున మునిగియుండు ప్రాప్తి నిక్కడనుండు నాటిదనుక పరమైకాంతి యగువాడు ప్రతి దినమును చింతించుచుండ గలవాడని యనుగ్రహించి ముగించినవారైరి. * * * * *

శ్రీకాంచీ ప్రతివాది భయంకరమ్
అణ్ణంగరాచార్యులు రచించిన
గద్యభావప్రకాశిక యను గద్యత్రయ
వ్యాఖ్యానము ముగిసెను.

శ్రీకాంచీపుర వాస్తవ్యులైన శ్రీమత్తిరుమల
అద్దంకి. విద్వాన్. శెట్టు. తాతాచార్యస్వాముల వారు
ఆంధ్రానువాద పరిష్కారకులు.

శ్రీరస్తు.

| | |
|---|---|
| స్తోత్రరత్న టీక | 1 0 0 |
| అతిమానుష స్తవటీక | 0 12 0 |
| అష్టశ్లోకీటీక. | 0 14 0 |
| హయగ్రీవస్తోత్రటీక, మణిప్రవాళ వ్యాఖ్యాచ. | 0 8 0 |
| యతిరాజవింశతిటీక | 0 12 0 |
| అత్యావశ్యకస్తోత్రటీక | 0 14 0 |
| తిరువాయ్‌మొழி మూలమ్. | 2 0 0 |
| భగవద్విషయ ప్రమాణ త్తిరట్టు | 1 8 0 |
| మూవాయిరవ్యాఖ్యాన ప్రమాణ త్తిరట్టు | 1 8 0 |
| ముముక్షుప్పడి మణవాళమామునికళ్ వ్యాఖ్యానమ్ ప్ర. అ. వ్యాఖ్యానత్తుడన్ తిరుమంత్ర ప్రకరణమాత్రమ్. | 1 0 0 |
| ఉపనిషత్సంగ్రహః, బ్రహ్మసూత్రాణిచ. | 2 8 0 |
| ఉపయుక్తరహస్యజాలమ్. ముముక్షుప్పడి తత్త్వత్రయమ్ శ్రీవచనభూషణమ్ మూలమ్ | 1 0 0 |
| శ్రీవచన భూషణరత్నమాలా (శ్లోకసమేతా) | 0 8 0 |
| రహస్యత్రయార్థరత్నమాలా, ,, | |
| తత్త్వత్రయార్థరత్నమాలా ,, | 0 8 0 |
| ఆచార్యహృదయమ్, మూలమ్ | 0 8 0 |
| అరుళిచ్చెయల్ రహస్యమ్, మూలమ్ | 0 8 0 |
| తత్త్వశేఖరమ్, ప్రమేయశేఖరమ్, ప్రపన్నపరిత్రాణమ్, అర్చిరాది | 1 4 0 |
| అర్థపఞ్చకమ్, ఆంధ్రటీక. | 0 6 0 |
| తిరుప్పల్లాణ్డు మణిప్రవాళ వ్యాఖ్యానమ్ | 0 6 0 |